# ఆధునిక
# భారత సాహిత్యకర్తలు

కె.వి.ఆర్.



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Adhunika Bharatha Sahitya karthalu - By K.V.R
ప్రచురణ నెం. : 1958

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి, 1996



టైటిల్ డిజైను : రమ

వెల : రూ. 20-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞాన్‌భవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, హైదరాబాదు, గుంటూరు, విశాఖపట్నం,
అనంతపురం, తిరుపతి, హన్మకొండ,
కాకినాడ.

అక్షరాలు : ట్వెంటీ ఫస్ట్ సెంచరీ, హైదరాబాద్. ఫోన్ : 4066 986

ముద్రితము : శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, 3-5-323, విఠల్‌వాడి,
నారాయణగూడ, హైదరాబాదు-500 029 * ఫోన్ : 597831

# ప్రవేశిక

గతకాలము మేలు వచ్చు కంటెన్" అనే గతైక దృష్టి వైదొలగసాగింది. బ్రిటిష్ రాజ్య స్థాపన ఫలితంగా కొత్త గాడుపు తోలసాగింది. విద్యా బుద్ధులు మారాకు వేశాయి. ఆర్థిక, రాజకీయ పరాధీనత స్వదేశీయుల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను అపహరించింది. ఈ దుస్థితిలో మన సమాజం కదలడం మొదలైంది. నిలవ నీటి మడుగు లాంటి సాంప్రదాయిక స్థితిని విడిచి, కొత్త ఒక వింతగా ఇంగ్లీషు చదువులు తలకెక్కించుకున్న వాళ్ళతోటి ఒక సరికొత్త వర్గం తలెత్తింది. ఆర్థిక పరిభాష నటుంచి, దీన్ని బుద్ధిజీవుల శిష్ట కూటమి అందాం.

ఈ కూటమి అఖండ పదార్థంకాదు. దీనికంతటికీ ఒకే ఒక్క లక్షణం లేదు. అయినా, తేడాల కంటె పోలికలే ఎక్కువ. బ్రిటిష్ రాజ్యానికి ముందు దేశం అరాజకం పాలై జీవితం అతలాకుతలమై ఉండేది. కాబట్టి బ్రిటిషు దొరతనం దేశానికి రాజకీయ సమైక్యాన్నీ, విద్యా విజ్ఞానపరమైన కొత్తదనాన్నీ, హేతుచింతననీ, శాస్త్రదృక్పథాన్నీ కలిగించి పురోభివృద్ధికి తోడ్పడిందని వీళ్లు భావించసాగారు. అయితే ఇది అపచైతన్యమే (ఫాల్స్ కాన్షస్‌నెస్). ఎందువల్లనంటే పరాధీన దుస్థితి గురించి వీళ్లు సవ్యంగా బోధపరచుకోలేకపోయారు. బ్రిటిష్‌రాజ్యం దైవప్రసాదమనుకున్నారు. ఈ స్థితిలో వచ్చిన మార్పులను సాంస్కృతికంగా, కళాసాహిత్యాలపరంగా 'పునరుజ్జీవనం' (రినేజాన్స్) అంటున్నారు.

మరుగున పడి ఉండిన కళా సాహిత్యాలు గ్రహణం విడిచాయా? వచ్చిన మార్పుల్లా కేవలం సమాజం ఉపరితలానికే పరిమితం అయిందా? ఈ కూటమికి నిజంగానే లోజాపూ, ముంజాపూ ఉండేవా? లేక వీళ్లంతా తలలను పరాయివాడికి తాకట్టు పెట్టుకున్నారా? అలా, పరాయివాడి కాడిని తమ మెడల మీద ఉంచుకొన్నారా? వీళ్లు రాజభక్తులూ దేశద్రోహులూనా? ఇలా వీళ్లను బ్రిటిష్‌వాడి తొత్తులని భావించే వాళ్లు ఉన్నారు గనకనే ఈ ప్రశ్నలు. ఇది పాక్షికం. సమగ్రత లోపించిన దృక్పథం. కాబట్టి సమదృష్టి అవసరం.

అది ప్రభాతం కాదు. కనీసం వేగుజామూ కాదు, వలస దాస్యం కారు నీడలింకా దట్టంగా వ్యాపించే ఉన్నాయి. రాజకీయంగా జాతీయతావాదం ఇంకా సంస్థారూపం ధరించలేదు. దేశ ప్రజాసామాన్యం జీవితం సజీవనరకంగా ఉంది. ఈ శిష్ట కూటమికి ఇలాంటివి పట్టవలసినంతగా పట్టలేదు. ఉదాహరణకు, తొలి స్వాతంత్ర్య పోరాటమని మనం ఇప్పుడు వర్ణిస్తున్న సిపాయి పితూరీ పట్ల వీళ్లకు సద్భావం లేదు సరిగదా, వ్యతిరేకత ఉండేది. దీనబంధుగుప్త లాంటి ఒకరిద్దరు కేవలం మినహాయింపే. అత్యధిక సంఖ్యాకులు ఆలోచనా సరళిలోనూ సామాజికాచరణలోనూ అక్షరాలా ఆంగ్ల మానసపుత్రులే.

అయినా వీళ్లు కొత్త పుంత పట్టారు. ఆచార దాస్యం వైదొలగించుకున్నారు. గతానుగతికత నుంచి తప్పుకుంటూ వచ్చారు. ఆంగ్ల విద్య వీళ్ల మనోనేత్రాన్ని

విప్పారిస్తూంది. మతోద్యమాలు నూతన సంచలనం కలిగిస్తున్నాయి. వీళ్లందరూ మతిమంతులు. వీళ్లకు దేశమంటే ద్వేషం లేదు. కాకుంటే, కాస్తో కూస్తో ఆస్తిపరులే. అది భూస్థితి కావచ్చు. లేదా అప్పూ సొప్పూ ఇచ్చేపాటి ధనమైనా కావచ్చు. అందుకని సామాజికంగా వీళ్లను మధ్య తరగతి అంటున్నాం. మధ్య తరగతి నడమంతరం స్థానం. ఎగబాకే చూపే ఎక్కువ. అట్టడుగు జనమంటే చీదర కాకున్నా, తృణీకార భావం. చదువు, నౌకరీ, రాబడీ మీద గురి. సొంతం అంటే మమకారం. అయినా వీళ్లంతా సంస్కారపరులే గాక, సంస్కరణలను అభిమానించారు. కాబట్టి వీళ్లలో ఇంతో అంతో అభ్యుదయాంశం ఉంది. దీన్ని గుర్తించకపోతే, వాళ్లకు అపచారం చేసినట్టే లెక్క.

భారతేందు హరిశ్చంద్ర, బంకించంద్ర ఛటర్జీ, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, వీరేశలింగం, చందూ మీనన్ వంటివాళ్లు తక్కువ వాళ్లేమీ కాదు. వాళ్లు సాహిత్యంలో అభినవ సృష్టి చేశారు. ఆధునికతకు బాట వేశారు. శాస్త్ర దృక్పథం, హేతు చింతన అలవరచుకున్నారు. ఆధునిక భారత సాహిత్యానికి కర్తలయ్యారు.

పైగా, పారిశ్రామిక విప్లవం ఇంగ్లాండులో జరిగిన నూరేళ్ల తదనంతరం, సంస్కృతి సాహిత్యరంగాలలో కొట్టవచ్చేట్టుగా కనిపించసాగిన కొత్త ధోరణులను 'పునర్వికాసం' అనవచ్చునా అన్నది అసలు ప్రశ్న. యూరపు చరిత్రలో మధ్య యుగాంతంలో ప్రాచీన, గ్రీక్, రోమన్ ప్రామాణిక గ్రంథాల ప్రేరణతో గొప్ప రచయితలూ, చిత్రకారులూ శిల్పులూ చేసిన అభినవ సృష్టి లాంటిదేనా ఇది? ఆనాటి యూరోపియన్ దేశాలకు స్వతంత్ర ప్రతిపత్తి ఉండేది. మన దేశానికి అలాంటిదేమీ లేదు. పరాధీనతలో స్వతంత్ర, స్వచ్ఛంద కళా వికసనం సంభవమేనా?

19 శతాబ్దానికల్లా పద్యం వెనకబడింది. జీవితంలో వచ్చిన పెనుమార్పుకు తగినట్లుగా వచనానికి ప్రాముఖ్యం వచ్చింది. పాశ్చాత్య దేశాల సాహిత్య రూపాలలో నవలకు ప్రధమస్థానం లభించింది. ఇక్కడ మన మతిమంతులు కూడా ఆ సాహిత్య రూపానికి మనస్సయ్యారు. అయితే, మనకు అది అపూర్వం. అందుచేత, విదేశాల నుంచి మనం ఈ ప్రక్రియను అరువు తెచ్చుకున్నాం. 'అరువు సొమ్ము బరువు చేటు' అనే మాట ఈ సందర్భానికి వర్తించదు. ఇది నూతనం. సామాజిక జీవితంలో రాసాగిన మార్పులను ఈ నవలా సాహిత్యం సక్రమంగా ప్రతిబింబించిందా, లేదా? అలా గాక, ముచ్చెన గుంట చూపుతోటి, గతమే ఘనమనుకుని, మార్పులను నిండుగా మనస్సుకు పట్టించుకోకుండా కేవలం అనుకరణమే జరిగిందా? ఈ రెండూ రెండు దృక్పధాలు. మన ఆధునిక సాహిత్యకర్తలు చేసింది అంధానుకరణం కాదు గాని, సమాజ వాస్తవానికి పరిపూర్ణ చిత్రణ కూడా కాదు. అట్లని, వీళ్లు 'రెంటికిం జెడిన రేవళ్లు' మాత్రం కాలేదు.

కాకుంటే, వర్తమాన దుస్థితికి సవ్యమైన పరిష్కారం తాము ముందుచూసి తమ పాఠకులకు పూర్తిగా చూపలేకపోయారు. కారణం ఏమిటంటే వాళ్ల సాహిత్య కృషి పసిబిడ్డ తప్పటడుగు లాంటిది మాత్రమే. ఇంకా మనసమాజంలో భూస్వామికం బలీయంగానే ఉంటూ వచ్చింది. దానికి సంబంధించిన భావజాలం పట్టు గట్టిగానే

ఉండేది. సామాజిక దురాచారాలు దేశం నట్టింటిలో తిష్టవేసుకు కూచునే ఉన్నాయి. పరాయి ప్రభుత్వం సహాయంతోటి జరిగిన సంస్కరణల ప్రభావం అతి పరిమితం. మతం కౌగిలి బిగువింకా సడలలేదు. పాత రాచరికాల గురించి వలపంత ఇంకా స్ఫుటంగానే ఉంది. వర్తమాన కాలం దుస్థితి పాతాళం లాంటిది. కాగా, భూతకాలంలో ఉండిందని తామనుకున్న సుస్థితి స్వర్గతుల్య అనిపించింది. మొదటిది వాస్తవం. రెండోది కల్పితం. ఈ కాల్పనిక మనస్కృత ఆధునిక భారత సాహిత్యకర్తలను ఆవేశించక తప్పలేదు. అందుచేత వాళ్ల రచనలలో గతం ఘనమనిపిస్తూ ఉంటుంది. కొత్త తొంగి తొంగి చూస్తూ వచ్చినా, ఆలోచనల కేంద్రస్థానం అయ్యేలాగా, నిబ్బరంగా నట్టింటిలోకి రాలేదు. కాబట్టే అది సంధియుగం.

దేశంలో ప్రాంతీయ భాష లన్నిటా వచ్చిన మార్పు పెను మార్పే. మధ్యయుగీన భావ పరిధి నుంచి బయటపడుతూ వచ్చినంతగా, ఆధునిక యుగ ప్రాంగణంలోకి గట్టి అడుగు ఇంకా పడలేదు. వాళ్లు వైతాళికులు మాత్రమే. పైగా, తమ తమ వర్గప్రయోజన పరాయణత్వం, దాని ఫలితంగా ప్రభుత్వం పట్ల గౌరవం, అభిమానం, నూతన కళాప్రక్రియలో ఇంకా చేకూరని నైపుణ్యం, ఇవీ ఈ యుగ సాహిత్యానికి ప్రముఖ లక్షణాలు. అయినా, వీరందరిలోనూ తరతమ భేదాలతో కూడిన అభ్యుదయ దృక్పథాన్ని నిరాకరించడం వెర్రి అయినా కావాలి, పోకిరీ అయినా కావాలి. ఈ పరస్పర విరుద్ధ ధృవాల మధ్య సవిమర్శా దృష్టితో, వారి సాహిత్య కృషిని వెలకట్టడానికి ఈ నా ప్రయత్నం.

## చివరగా రెండు మాటలు

దాదాపు 20 ప్రధాన భాషలున్న మనదేశంలో ఈనాటికీ ఒక భాషాప్రాంతానికి మరొక భాషాప్రాంతానికి చెందిన సాహిత్య సంస్కృతులు తెలియవలసినంతగా తెలియవు. 'భారతీయ'మని చెప్పదగిన ఏక జాతిభావం పుట్టి పెరగటానికి ఇది ప్రబల ఆటంకమని వేరే చెప్పవలసిన పనిలేదు.

ఇంగ్లీషులోనూ ప్రాంతీయ భాషలలోనూ భారతీయ సాహిత్యకర్తల జీవిత చరిత్రలు కూడా తగినంతగా లేని లోటును పూరించడం కోసం, కేంద్రంనుంచి ఒక సాంస్కృతిక సంస్థ పక్షాన Makers of **Modern** Indian Literature అంటూ లఘుగ్రంథ పరంపర ఒకటి వెలువడింది. ప్రముఖ ఆధునిక సాహిత్యకారుల జీవిత, సాహిత్యాల పరిచయాలతో ఇది తృప్తిపడింది. ఇప్పుడు నేను రాసిన పుస్తకం మరి దేనికీ అనువాదం కాదు. అట్లని ఇది స్వతంత్ర రచన కూడా కాదు.

ఈ వ్యాసాలను తమ దినపత్రికలో వరసగా ప్రకటించిన 'ఆంధ్రప్రభ'కు కృతజ్ఞుణ్ణి. ఈ వ్యాసాలలో కొన్నిటిని వెలికిదీసి జెరాక్స్‌కాపీ తీయించి నాకు అందజేసిన శ్రీ వాకాటి పాండురంగరావు గారికీ, శ్రీ గుర్రం శ్రీనివాస్‌గారికి గూడా రుణపడి ఉన్నాను. మరి, వీటికి గ్రంథరూప మివ్వబూనిన 'విశాలాంధ్ర ప్రచురణాలయం' వారి మాట చెప్పడమెందుకు?

కె.వి.ఆర్.

# విషయసూచిక

# భారతేందు హరిశ్చంద్ర



తులసీదాస్ తర్వాత చెప్పుకోదగిన హిందీకవి భారతేందు హరిశ్చంద్ర (1850–1885). భక్తి సంప్రదాయంలో చాలు చివరి మొక్క గూడా. కవి మాత్రమే కాదు, నాటకకర్తా, పాత్రికేయుడూ, వ్యాసరచయిత, జీవితచరిత్రకారుడు, ప్రాచీన చారిత్రక విషయజ్ఞుడూ. ఈ రంగాలన్నిటా ప్రథముడు అయినా కాకున్నా ప్రథములలో ప్రముఖుడు.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కేశవ్ చందర్ సేన్ వంటి సమకాలిక ప్రముఖులను మిత్రులుగా భావించగలిగాడు. మైకేల్ మధుసూదన్ దత్ [illegible] వంటి వారితోనూ సాన్నిహిత్యం వుండేది. సంఘ సంస్కరణ భావాలు తన [illegible] వింతగాదు. బెంగాల్ సాంస్కృతిక పునరుజ్జీవనం తనకు ఉద్దీప్తి కలిగించి[illegible].

ముప్పైఅయిదేళ్ళ వయస్సులో ఒకానొక భాషా సాహిత్యాన్ని 'ఆధునికత' ముంగిటికి తెచ్చి నిలపడం, దాదాపుగా అనన్యం.

దేశంలో బ్రిటిషు సామ్రాజ్యానికి అంకురార్పణ చేసిన రాబర్ట్ క్లైవ్ నయవంచనకు గురయ్యాడు. హరిశ్చంద్ర ముత్తాత సేఠ్ అమీచంద్. అప్పట్లో ఈ కుటుంబం బెంగాలులో వుండేది. అమీచంద్ మతిచెడి మరణించడంతోటే అతని కుమారుడు ఫతేచంద్ బెనారస్‌కు వెళ్ళి స్థిరపడ్డాడు. బెనారస్ మహారాజా ప్రాపకం సంపాదించి పైకి వచ్చాడు. అతని బిడ్డ గిరిధర్‌దాస్ వ్యాపారం చేస్తూనే వైష్ణవ భక్తికవిగా పేరుబడ్డాడు. హరిశ్చంద్ర తండ్రినిమించిన తనయుడు.

**'భారతేందు' అనేది తల్లితండ్రులు** పెట్టినపేరూ గాదు, బిరుదూగాదు. సరదాగా మిత్రులు పెట్టిన పేరు మట్టుకే. ఇతరులను తాను దెప్పుతూ వుంటే చంద్రుడులో వున్నట్టు నీలో మాత్రం కళంకం లేదా, నువ్వు భారతేందుడివి అన్నారు. అదే నిలిచిపోయింది. మీదుమిక్కిలి చంద్రోదయ లాంఛనంతో లెటర్‌పేడ్ వేయించుకున్నాడు. అక్కడితో ఆగక నానా తంటాలుపడి దీనికి దొరతనం గుర్తింపు సంపాదించుకున్నాడు.

రాజభక్తి ఊపిరిగా జీవించిన కుటుంబం తనది. మొదటి స్వాతంత్ర్య పోరాటం నాటికి తనకు ఏడేళ్ళ వయస్సు. కుంఫినీవారికి తండ్రి ఎంతో సాయం చేశాడు. ఎందరో దొరల ప్రాణాలు కాపాడాడు. హరిశ్చంద్ర కూడా ప్రభువుల కరుణాకటాక్షాల కోసం వెంపర్లాడినవాడే. తాను స్థాపించి నిర్వహించిన సాహిత్య పత్రికలు నిలదొక్కుకోడానికి ఒక కారణం, సగం ముప్పాతిక కాపీలను ఇంగ్లీషు సర్కారుకొని ఆదుకోవడం అనవచ్చు. కాకుంటే, చివరిదశలో దొరతనం కన్నెర్ర జేసింది. 'సితార–ఇ–హింద్' అనే బిరుదు తగిలించుకున్న రాజా శివప్రసాద్ ఈ విషయంలోనూ తనకు పోటీదారు అయ్యాడు. దొరలకు చాడీలు చెప్పి హరిశ్చంద్రపట్ల మనస్సు విరిచాడు. అంచేత అతని పత్రికలకు ప్రభుత్వ సమాదరణ ఆగిపోయింది. అవి శుష్కించిపోయాయి. అయినా మిత్రులూ సహచరులూ ఒక్కొక్క రొక్కొక పత్రిక పెట్టి, హరిశ్చంద్ర నెలకొల్పిన సంప్రదాయం నశించకుండా చూశారు. నీలమేఘ వర్ణుడేమో, పరిహాసానికి 'కలియుగ కన్నయ్య' (కలియుగ కృష్ణుడు) అంటూ మిత్రులు వర్ణించారు.

యవ్వనాన్ని భోగాలలో సుఖాలలో తగలేసి ఉమ్మడి కుటుంబం నుంచి సంక్రమించిన ఆస్తిని హారతికర్పూరంగా కరిగించివేశాడు. బాల్యవివాహాల రోజులు. భార్యతో తృప్తిలేదు. వేశ్యా సాంగత్యం కళాతృష్ణను తృప్తిపరిచిందో లేదో గాని సుఖలాలసతను మరింత పెంచింది. మాధవి అనే వేశ్య వుంపుడు గత్తెగా మారితే, బెంగాలు నుంచి వచ్చి చేరిన మల్లిక 'ఉపపత్ని' అయింది. మొత్తానికి తాను రసికావతంసుడు. అంత్యదశలో అప్పులపాలై తనవాటా ఆస్తి క్రమంగా తన సోదరుడి పాలబడుతుంటే చూస్తూ వుండవలసి వచ్చింది. సంగీతం చేత బేరసారాలుడిగాయో లేదోగాని, సాహిత్యం కంటె ఎక్కువగా స్త్రీలోలత్వం చేతనే ఆస్తిపాస్తులుడిగాయి. ఈ ఆస్తిపాస్తులు నా పూర్వీకుల్ని తినివేశాయి. నేను యీ ఆస్తిపాస్తుల్ని తినివేస్తాను అన్నాడు. అన్నంత పనీ చేశాడు. కొవ్వొత్తి రెండుకొసలా వెలిగించాడు. డబ్బే లేకుంటే, తాను సాహిత్య జీవిగా ఇంత రాణింపుకు వచ్చివుండేవాడు కాదు. పరిమళ ద్రవ్యాలకూ చీనిచీనాంబరాలకూ ఎంత

కరారావుడు చేశాడో, అరుదైన చిత్రాలకూ లిఖిత పత్రాలకూ పాత పుస్తకాలకూ ముద్రణాలయాలకూ అంతకంత సద్వ్యయం చేశాడు. తాను దరిద్రుడవుతూ హిందీని సంపన్నం చేశాడు.

ఉత్తర భారతదేశంలో ఒకో ప్రాంతానికి ఒకో భాష దేనియాసతో అది వుంటూ వచ్చినా, ఢిల్లీ చుట్టుపట్ల హిందీ ప్రచురంగా వుండేది. ముస్లిం దండయాత్రల తర్వాత సైనికశిబిరాల భాషగా మొదలై అరబీ, పార్శీ పదబాహుళ్యంతోటి ఉర్దూ పైకి వచ్చింది. సుల్తానులూ పాదుషాలూ మొదలు మత ప్రచారకుల దాకా అన్యమతస్థులైన ముస్లిములు హిందీని ఆదరించారు. అమీర్‌ఖుస్రూ, జయసీ వంటి గొప్ప కవులు, తులసీదాసు, సూర్దాసు వంటి కవుల ఏమీ తీసిపోకుండా ఈ భాషలోనే రాశారు. అక్బరు వంటి చక్రవర్తులు ప్రోత్సహించారు. చివరి మొగలాయీ చక్రవర్తి బహదూర్‌షా 'జాఫర్' మంచి హిందీ కవి. అయితే, వచన సాహిత్యం అప్పటికింకా యీ భాషలో వృద్ధికి రాలేదు. మిషనరీలూ కుంఫినీ సర్కారూ హిందీని పట్టించుకోక తప్పలేదు. రాజారామమోహన్‌రాయ్ తన 'బంగదూత్' పత్రికను నాలుగు భాషలలో ప్రచురించేవాడు. అందులో హిందీ ఒకటి. మొట్టమొదటి హిందీ పత్రిక 'ఉదంత్ మార్తాండ్' హిందీ వచనాన్ని వాడింది. (1826), రాజభాషగా ఉంటూ వచ్చిన ఉర్దూతో ఇది పోటీపడి నెగ్గుకురాలేకపోయింది. తారామోహన్ మిత్ర బనారసు నుంచి ప్రకటించసాగిన హిందీ పత్రిక (1844) దేవనాగిరి లిపితో పార్శీ శబ్ద బహుళమైన ఉర్దూను పోలిన హిందీని వాడేది. దాని పోషకుడు రాజాశివప్రసాద్ యిలాంటి భాషనే అభిమానించేవాడు. దీనికిపోటీగా 1850 లో 'సుధాకర్' శుద్ధ హిందీలో వుండేది. దీన్ని రాజా లక్ష్మణ్‌సింగ్ ప్రోత్సహించేవాడు. ఈ యిరుకుకూటాల వాదోపవాదాలు చెలరేగిన తరుణంలో హరిశ్చంద్ర రంగప్రవేశం.

'కవివచన్‌సుధ' అనేతన మాసపత్రిక (1867) కవిత్వానికే పరిమితం. క్రమంగా ఇది వారపత్రిక అయింది. అప్పటికీ అతనికి రచయితగా గుర్తింపువుంది. 'హరిశ్చంద్ర చంద్రిక' అంటూ 1873లో మరో పత్రికనుపెట్టాడు. నాటకం, పుస్తక సమీక్షలు, చదరంగం, హాస్యం వంటి విషయాలూ, వ్యాసాలు వుండేవి. దీనికి రచనలు పంపినవాళ్ళను 'ఉపసంపాదకులు' అని పేర్కొనేవాడు. వారిలో కొందరు ఈశ్వర్‌చంద్ర విద్యాసాగర్, కేశవ్ చందర్‌సేన్, స్వామిదయానందసరస్వతి. ప్రజాసామాన్యం నిత్య వ్యవహారభాషను ప్రచారం చెయ్యడమే ఈ పత్రికలో విశేషం. సంస్కృత పదభూయిష్ఠమైన హిందీని కూడాఇది వదిలేసింది. దీన్నిచూచి 'హరిశ్చంద్రమండల్' అనబడే యితని మిత్ర బృందం ఇలాంటి పత్రికల నెన్నిటినో స్థాపించి నడిపింది. 'చంద్రిక' విజయంతోటి 'బాలబోధిని' 'భగవత్ తోషిణి' అనే పత్రికలను మొదలెట్టాడు. మొదటిది స్త్రీలకోసం, రెండోది తనలాంటి వైష్ణవ భక్తులకోసం. వైష్ణవ మత భావ ప్రచారానికి ఒక సమాజాన్నే నెలకొల్పాడు.

అంతతో ఆగక, అప్పట్లో హిందూ–ముస్లిం సమైక్యాన్ని దెబ్బతీసిన గోవధా నిషేధం విషయంలో గోమాంస భక్షణకూ మద్యపానానికీ వ్యతిరేకంగా ఖచ్చితమైన వైఖరిని అవలంబించాడు. తాను విదేశీ వస్త్రధారణ మానడమేగాక, తన పత్రికా

పాఠకులను గూడా స్వదేశ వస్త్రధారణ గురించి శపథం చేయవలసిందిగా కోరాడు. ఉర్దూకి బదులుగా హిందీ రాజభాష కావలెనంటూ ఆందోళనకుగూడా నడుంకట్టాడు. దొరలతో పూసుకు తిరిగినవాడు, సామ్రాజ్ఞినీ ఆవిడ భర్తనీ వారి బిడ్డల్నీ పేరుపేరూ పొగుడుతూ ప్రశస్తులు రాసినవాడు, భారతీయులు పాశ్చాత్య దేశాలకు వెళ్ళిచూచి వచ్చి దేశాన్నిపరిశ్రమావంతం చెయ్యాలనీ, శాస్త్రవిజ్ఞానాన్నీ, యంత్రపరిజ్ఞానాన్నీ ఆకళించుకోవాలనీ పదే పదే కోరినవాడు, క్రమంగా మార్పు చెందాడు. తెల్లవాడు దేశాన్ని ఎలా కొల్లగొట్టిందీ గ్రహించాడు. నలుగిరికీ ప్రచారం చేశాడు. మునిసిపల్ కౌన్సిలు సభ్యత్వాన్నీ గౌరవ మేజిస్ట్రేటు పదవినీ వదులుకున్నాడు. రాజా శివప్రసాద్ వంటి పరమ రాజభక్తులు ప్రభుత్వ యంత్రాంగంలో దూరి హరిశ్చంద్రకు వ్యతిరేకంగా పనిచేశారు. రాజ్యాధిపతులంటే వ్యక్తులుగా తనకు భక్తిఇంకా మిగిలేవున్నా ప్రభుత్వ ప్రాపకం మాత్రం తప్పిపోయింది. పాముపగ, పడగచుట్టం అంటే యిదే ఫలితం. అది గ్రహించే నాటికి, భారతేందు హరిశ్చంద్రకు అస్తమయం సమీపించింది. చింత చచ్చిందిగాని పులుసు చావలేదు.

పదేళ్ల ప్రాయంలోనే కవిత్వం గిలకడం మొదలెట్టిన హరిశ్చంద్ర భక్తికవి మాత్రమే కాదు. ఎన్నో సామాజిక, రాజకీయ యితివృత్తాలనుగూడా స్వీకరించాడు. ఇంద్రియ లాలసకూ భక్తికీ మధ్యే మార్గంలో శృంగారాన్నీ, భక్తినీ మేళవించి, 'భక్తసర్వస్వ', 'ప్రేమమాలిక', 'ప్రేమ సరోవర్', 'ప్రేమ మాధురి', 'ప్రేమ పుల్వారి', 'ప్రేమతరంగ' వంటి కావ్యాలను తనకు ఎంతో యిష్టమైన ప్రజభాషలో రాశాడు. 'ఖడీబోల్' భాషా కావ్యాలను గూడా మొదట్లో రాసినా వాటిని యివి కమ్మివేశాయి. అలాగే ఉర్దూలో గూడా 'రస' నే మారు పేరుతో కవిత్వం రాసి, ఉర్దూకవులను పోషించాడు. ఉర్దూకావ్య సంకలనాలు రెండు ప్రకటించాడు. ఉర్దూలో వచనంకూడా రాశాడు.

పద్దెనిమిదేళ్ళ సాహిత్య జీవితంలో బెంగాలీ, సంస్కృతం, ఇంగ్లీషు నాటకాలను కొన్నింటిని అనువదించి స్వతంత్ర నాటకాలనూ రాశాడు. వీటిలో 'సత్య హరిశ్చంద్ర' ఒకటి, 'నీల్దేవి' మరొకటి. జతీంత్రమోహన్ ఠాకూర్ బెంగాలీ నాటకం ఆధారంగా 'విద్యాసుందర్' ఇంకొకటి. పార్శీ నాటకాల కంపెనీలు, వాటినిచూచి హిందీ నాటక సమాజాలు విజృంభించిన రోజులవి. తన నాటకాలలో పాత్రోచిత భాషను ఓం ప్రథమంగా వాడిన నాటకకర్త హరిశ్చంద్ర. తాను నటుడు కూడా. 'నాటక్'నే గ్రంథంలో నాటక కళను వివరిస్తూ యూరోపియన్, బెంగాలీ నాటక రచనా ధోరణులను ప్రస్తావించి ఆధునికతను ప్రశంసించాడు. పౌరాణిక, చారిత్రక, సామాజిక యితివృత్తాల తోటి సమకాలికతను దృష్టిలో వుంచుకుని, వితంతు పునర్వివాహం, మాంసభక్షణం, స్వదేశ సంస్థానాలలో దుష్టపరిపాలన, స్వదేశస్థులను సంతృప్తిపరిచేందుకు బ్రిటీష్ దొరతనం భారతదేశ సంపదను కొల్లగొట్టటం వంటి విషయాలకు తన నాటకాలలో స్థానం కల్పించాడు. 'భారత దుర్దశ', 'విషస్య విషమౌషధమ్', 'వైదికిహింస', 'హింసానభవతి' వంటి నాటకాలు పేర్కొనదగ్గవి.

వ్యాసకర్తగా సాహిత్యవిమర్శా సిద్ధాంతాలను ప్రతిపాదించడమేగాక, అనేక కృతులను అంచనా వేసి చూపడానికి గూడా ప్రయత్నం చేశాడు. దేశ చరిత్రలో వివిధ దశల

గురించి రాస్తూ, బ్రిటిష్, ఫ్రెంచి చరిత్రకారులను ఎందరినో పేర్కొన్నాడు. ప్రాచీన దేవాలయాల గురించీ తామ్ర శాసనాలగురించీ రాశాడు. సముద్ర ప్రయాణం, బాలికా విద్య, బహుభార్యాత్వం, బాల్యవివాహాలగురించి అభ్యుదయ భావాలు ప్రకటించాడు. దేశప్రజల సమైక్యం విషయంలో మత భేదాలు అడ్డురాగూడదన్నాడు.

రెండో భార్యచేత బెంగాలీ నవలలను అనువదింపజేస్తూ తానుస్వయంగా బంకించంద్ర ఛటర్జీ నవల 'రాజ్ సింహ' అనువాదం ప్రారంభించాడు గాని పూర్తి చెయ్యలేదు. మిత్రుల చేత మాత్రం 'దుర్గేశ్ నందినీ' 'కాదంబరి', 'స్వర్ణలత' వంటి నవలలు హిందీలోకి తర్జుమా చేయించాడు. మరి కొన్నేళ్ళు జీవించివుంటే.....?

హిందీ బోధనాభాషగా ఒక విశ్వవిద్యాలయం, వాయువ్య సరిహద్దు రాష్ట్రంలో 'కళాశాల' స్థాపించాలనీ అమెరికా, ఫ్రాన్సు, బ్రిటన్ దేశాలను దర్శించి రావాలనీ అనుకున్నాడు. అయితే 1885 జనవరి 5న చనిపోయాడు. హిందీ పత్రికా రచన, నాటకం, నవల, వ్యాసం, ఖడీబోలీ కవిత్వం పురోగమించే తెన్నుచూపి, స్వయంగా దోవతొక్కి మార్చిపోయాడు. సంస్థాకల్పుడయ్యాడు. 'హరిశ్చంద్ర మండలి' ద్వారా ఒకటికి పదిచేతులు తోడయ్యేట్టుగా చేశాడు. అదే చాలు.



# ప్రేమ్‌చంద్



తల్లితండ్రులు పెట్టినపేరు ధన్‌వత్‌రాయ్. సాహిత్య జీవితంలో పదిహేను సంవత్సరాల తొలిదశలో ప్రచారమైన పేరు నవాబ్‌రాయ్. రచనల మూలాన బతుకుదెరువైన ఉద్యోగానికి ముప్పు వస్తుందని జాగ్రత్త కోసం పెట్టుకున్న పేరు ప్రేమ్‌చంద్. ఏ పేరుతో రాసినా తనది విలక్షణమైన ముద్ర.

రెండు వందల యాభై కథలూ పన్నెండు నవలలూ, ఎన్నో వ్యాసాలూ, అనువాద రచనలూ, బాలసాహిత్యం వగైరా సృష్టించిన గొప్ప రచయిత మున్షీ ప్రేమ్‌చంద్ (1880–1936) తాను తప్ప తక్కిన వాళ్లెవరూ తన కావించిన సృష్టి చెయ్యలేరనిపించాడు. హిందీ ద్వారానే ఈనాడు ప్రసిద్ధుడయిన రచయితకు పాతికేళ్ల వయస్సులోగాని హిందీ భాష సరిగా రాదు. దాన్ని నేర్చుకుని అందులో సాహిత్యం

సృష్టించడానికి ఎంతో శ్రమ అవసరమయింది. మొదట్లో తన రచనా భాష ఉర్దూ. చిన్నతనంలో ఒక మౌల్వీ వద్ద నేర్చుకున్నది బాగా అక్కరకు వచ్చింది. అయితే అది అన్నంపెట్టదన్న విషయం అటు తర్వాత తెలిసింది. పైగా పదిమందిలోకి పోవాలంటే ఉర్దూ కంటే హిందీయే బాటైన దారి. హిందీ ఉర్దూలు విరోధులో పోటీదారులోనని తాననుకోలేదు. ఇవి రెండూ మరింత సన్నిహితం కావాలని తన ఆకాంక్ష. ఉర్దూలో రాసి ప్రకటించి ఉండిన తొలి కథలనూ, నవలలనూ తానే హిందీలోకి మార్చుకొన్నాడు. హిందీ సాహిత్యంలో ఆధునిక శక కర్త అనిపించేంతగా హిందీని సంపన్నం చేసిపోయాడు. ఆశ్చర్యకరమే మరి.

కష్టపడి ఇంటర్, బి.ఏ. పరీక్షలను రాసి ఎలాగో నెగ్గాడు గాని ధన్‌పత్‌రాయ్ స్కూలు చదువు మెట్రిక్యులేషన్ వరకే. పసితనంలో కన్నతల్లీ ఉగతెలిసే ప్రాయాన తండ్రీ పోయాక సవతల్లీ ఆమె కుమారుడూ సోదరుడూ తన సంపాదన మీదనే ఆధారపడవలసి వచ్చింది. వారణాసికి కూతవేటులో వున్న లమహి స్వగ్రామం. తాతగారి హయాములో స్థితిపరులేగాని తండ్రి హయాములో పేదలే. తండ్రి పోస్టుమాస్టరు. తాను చిన్న బడిపంతులు. విద్యార్థిగా వుంటూనే అదనపు రాబడి కోసం తనకంటె పెద్దింటి చిన్నవాళ్ళకు బోధించవలసివచ్చింది. జీతం భత్యం లేకుండానే చదువుకొంటూ వచ్చినా డబ్బుతో పెద్ద అక్కరే వుంటూ వచ్చింది.

చిన్న బడినుంచి పెద్ద బడికి, వూరినుంచి మరో వూరికి మారుతూ, పెద్ద పరీక్షలు యిచ్చాక స్కూళ్ల ఇన్‌స్పెక్టర్ హోదా సంపాదించుకున్నాడు. ఎక్కడ పనిచేసినా కళ్లూ చెవులూ విప్పార్చుకొని చుట్టుపక్కల్ని గమనిస్తూ జీవితాన్ని దగ్గరిగా పరిశీలించాడు గనకనే సాహిత్యంలో ప్రవేశపెట్టగలిగాడు. మట్టివాసన కొట్టే సాహిత్యంలో యధార్థజీవితం తన వైఫల్యం తోటి, వివిధత్వం తోటి, సాదాజనం సుఖదుఃఖాలతోటి, కలలూ కామనలతోటి, ఎగుడుదిగుళ్ళ బతుకులతోటి విశ్వసనీయంగా దూరి కూర్చుంది. ఇదే తన సిద్ధి.

ఉర్దూలో గొలుసు కట్టుకథ మొదలు బంకించంద్ర ఛటర్జీ తర్జుమాల దాకా ఎన్నిటినో చదువుకొన్నాడు. రవీంద్రనాథ్ టాగోర్ కవిత్వాన్నీ పుక్కిలించాడు గాని పుక్కిలించి వదిలాడు. ఎంత కమ్మటివైనా కలలు తనకు సరిపడవు. ఆదర్శవాదానికీ తనకూ పొసగదు. తనది గట్టినేల. టాల్స్టాయి రచనలు చదవడమే గాదు, కొన్నాళ్ళు ఆ తత్వాన్ని ఒంటబట్టించుకొని అనువాదం కూడా చేశాడు. డికెన్సునీ అభిమానించాడు. అనతోల్ ఫ్రాన్స్‌ని కూడా. చివరికి గోర్కీని చేరుకున్నాడు. గోఖలేనీ తిలక్‌నీ గాంధీనీ దాటుకొంటూ సామాజిక రాజకీయ తత్వంలో 'మహాజనీ సభ్యత' అనబడే వ్యాపార సంస్కృతికి పట్టువేరైన పెట్టుబడిదారీ వ్యవస్థను నిరసిస్తూ సోషలిస్టు వ్యవస్థనూ కష్టజీవుల సంస్కృతినీ అభిమానించే దాకా భావ పరిణామ క్రమాన్ని అనుభవంలోకి తెచ్చుకొన్నాడు. పోలికలు చూపడం మంచిదికాదు గాని ప్రేమ్‌చంద్‌ను 'హిందీగోర్కీ' అనే విమర్శకులు లేకపోలేదు. తన కుమారుడు అమృత్‌రాయ్ తనని 'కలమ్‌కా సిపాహీ' (కలం సిపాయి) అని వర్ణించాడు గాని 'కలం పట్టిన కష్టజీవి' అని వర్ణించడం సబబు.

ఈ శతాబ్దం తోటి ప్రేమ్‌చంద్ సాహిత్యజీవితమూ మొదలయింది గుడిగుట్టును రద్దు చేస్తూ పూజారుల్ని పండాల్నీ ముసుగు వూడలాగి లోకం న్యాయస్థానంలో నేరస్థులుగా నిలబెట్టిన 'అస్రారెమాబిద్' నవల మొట్టమొదటిది. ఇది అపరిణత రచన. మంచీ చెడూ విడివిడిగా వుండవని అప్పటికింకా గ్రహించలేదు. ఉన్నది ఉన్నట్టే చెప్పే పద్ధతి సరైంది కాదు. భావనాశక్తి కూడా అవసరం. కొంతవరకు రెండో నవల 'హమ్–దార్మా–ఒహమ్ నవాబ్' ('ప్రేమ' పేరుతో హిందీలోకి తానే 1907లో అనువదించాడు) లో యీ లోపం తొలగిపోయింది. అమృత్‌రాయ్ అనే ఆదర్శవాది ప్రేమ అనే సంపన్నసుంగరిని కాదని పూర్ణ అనే వితంతువుని పెళ్ళాడుతాడు. ధన్‌పత్‌రాయ్ కూడా శివరాణీ దేవి అనే బాలవితంతువును పెళ్ళాడాడు గాని అది రెండో పెళ్ళి. తాను చూసీ పెట్టకుండానే ఒక అనాకారిని తెచ్చి తనకు తగలగట్టిన వారిని పుట్టింటికి చేరుకుని తనకు చచ్చిన మనిషితో సమానమైన మొదటి భార్యనూ కాదని, ఈ స్వయంవరం జరిగింది. ఈ కథా అఘటనా దాదాపు ఏకకాలానివే.

ప్రేమ్‌చంద్ కథల్లో మొదటిది 'దున్యాకా సబ్‌సే అన్మోల్ రతన్' (యావత్ప్రపంచంలోకి అమూల్యరత్నం). ఏమిటది? ఉరికంబ మెక్కిన తనయుడి గురించి తండ్రి పెట్టుకున్న కన్నీళ్ళా? కాదు. భర్త చితాకాష్ఠం మీదికెక్కి ప్రాణార్పణ చేసుకొన్న పతివ్రత చితాభస్మమా? కాదు. దేశ స్వాతంత్ర్యం నిమిత్తం ఒలికిన చివరి నెత్తురుబొట్టే అది.

ఇలా రాస్తూ వచ్చిన కథలను 'సొజెవతన్' పేరుతోటి సంపుటంగా ప్రకటించిన వెంటనే జిల్లా కలెక్టరు దృష్టిలో పడి ఉద్యోగానికి తొలిగండం వచ్చింది. మిగిలి ఉన్న ప్రతులను తన కంటిముందే తగలబెట్టారు. పాత పేరు లాభంలేదనుకొని, 'జమానా' పత్రికా సంపాదకుడు సూచించిన 'ప్రేమ్‌చంద్' అనే పేరు స్వీకరించాడు. పేరు మారిందిగాని దిణుసు మారలేదు.

అప్పటికి తన వయస్సు ముప్పై. గంపెడు సంసారం తన వరుంబడిమీద ఆధారపడి ఉంది. ఉద్యోగం ఒక్కటే జీవనాధారం. కాబట్టి జాగ్రత్త అవసరం. వర్తమాన జీవితాన్ని గాకుంటే చారిత్రక గాథలను ఆశ్రయించి, తాను చెప్పబూనినదాన్ని అన్యాపదేశంగా చెప్పాడు. పనిచేస్తున్న బుందేల్‌ఖండ్ ప్రాంతం అలాంటి వీరగాథలకు కాణాచి. స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగా తాను ఉన్నచోట ఉండకుండా వూళ్ళన్నీ తిరగాలి. ఇదీ మంచికే. జీవితానుభవం విస్తరించింది.

ఉర్దూను విడిచి హిందీలో రాయడమూ దాదాపు ఈ దశలోనే మొదలయింది. ఆరోగ్యం దెబ్బతిన్నా రచన నిరంతరాయంగా సాగింది. భావాలు కుబుసం విడుస్తున్నై. రాజకీయంగా అతివాదంవైపు మనస్సు మళ్లింది. గాంధీలో గోఖలే మాత్రమే కాదు తిలక్ సైతం కనిపించాడు. నిజమూ అంతే. గాంధీ పద్ధతులేమో అతివాదులవీ, లక్ష్యాలు మాత్రం మితవాదులవీ. గాంధీ అహింసాతత్త్వం ప్రేమ్‌చంద్ మనస్సుకు బాగా పట్టింది. ఇరవైయేండ్ల పాటు చేసిన ఉద్యోగాన్ని మరో ఆలోచన లేకుండా వదిలిపెట్టడానికి ఇది ప్రేరణ.

ఈ లోపల హిందీ కథల తొలి సంపుటాన్ని 'సప్తసరోజ్' పేరున ప్రకటించాడు.

'సేవాసదన్' తోటి హిందీ నవలాలోకంలో సంచలనం కలిగించాడు. ఆ తర్వాత 'ప్రేమాశ్రమ్' వచ్చింది. 1921 లో ఉద్యోగానికి స్వస్తి చెప్పాడు. ఇప్పుడిక రచనే బతుకుదెరువు. 'వర్‌దాన్', 'రంగభూమి', 'ప్రేమాశ్రమ్', 'కాయ్‌కల్ప్', 'నిర్మల', 'గబన్', 'గోదాన్' నవలలూ 'ప్రేమ్‌బత్తీస్', 'ఫిర్దౌస్-ఎ-ఖ్యాల్', 'మానససరోవర్' కథా సంపుటాలూ వెలువడ్డాయి. 'మంగళసూత్రం' అనే నవల ప్రారంభించిన కొద్ది కాలానికే మృత్యువు వచ్చి తలుపు తట్టింది. తలుపు తీశాడు.

తలుపులు తీసుకుని లోకం నుంచి నిష్క్రమించే ముందు లక్నోలో అభ్యుదయ రచయితల సంఘం ప్రారంభ మహాసభకు అధ్యక్షత వహించిన ప్రేమ్‌చంద్ తన జీవితంలో చివరి మజిలీ చేరుకొన్నాడు. జవహర్‌లాల్ నెహ్రూ సోషలిస్టు అనుకూలత తన భావపరిణామాన్నీ ఒక కొలిక్కి తెచ్చింది. ప్రేమ్‌చంద్ సాహిత్యం ఇలా మార్గదర్శకం కాగలిగింది.

కాలదోషం పట్టిన సామాజిక సంస్థలనూ వ్యవస్థలనూ, మనుషుల ఆలోచనలనూ ఆచరణనూ కలంకత్తితో ఖండిస్తూ వచ్చిన రచయిత, గ్రామీణ సమాజాన్ని శతాబ్దాల నుంచీ శాసించిన దౌర్జన్యాన్ని దగా దోపిడీలనూ సహించి తన తలవంచడమంటూ ఎన్నడూ చెయ్యలేదు. కేవలం దుఃఖాన్నీ, దైన్యాన్నీ చిత్రించడమే గాక సమాజాన్ని మంచివైపు నడిపించగల పురోగామి ధోరణులను సూచనప్రాయంగానే కాకుండా కొన్ని ప్రాంతాల ద్వారా ఘటనల ద్వారా వాచ్యం కూడా చేశాడు. మారేకాలం వేగాన్ని అందుకోవడమే గాక, రాగల మంచి రోజులను భావాల రూపంలో నైనా చూడగలిగాడు. వాస్తవవాద దృక్పథమే అలాంటి శక్తి నిచ్చింది. జీవితమే తన ఇతివృత్తం. పచ్చిగా కాకుండా దాని పరిణత రూపాలను తీసుకున్నాడు. విలక్షణ మనిపించినా నలుగురికీ ప్రాతినిధ్యం వహించి మచ్చుతునకలనిపించే పాత్రలను రూపొందించాడు. వాటికి జీవకళ ఇలానే వచ్చింది. పాఠకుల అభిరుచిని బట్టి రచనలు చేయడం కాకుండా రచనల ద్వారా పాఠకుల అభిరుచిని సంస్కరిస్తూ సాహిత్యం సాయంతో సామాజిక రాజకీయ పుత్త్రేరణ కలిగించాడు. ఇలా కళకు కృతార్థత సమకూరింది.

ప్రాణావసాన వేళల్లో గూడా దేవుడిమీద భారం వెయ్యని వ్యక్తి నిరీశ్వరవాది అయ్యాడనడం కంటె మానవతావాది అయ్యాడనడమే సరి. తొలి రచనలలో తొంగిచూస్తూ వచ్చిన పారమార్థిక భావాలను ప్రయత్నపూర్వకంగా వదిలించుకుని హేతువాదాన్ని పెంపొందింపజేసుకున్నాడు. ఇందతా కలిసి అతని మానవతావాదాన్ని ఆచరణీయంగా సంస్కరణాత్మకంగా మలిచింది. జీవితాన్ని విషతిక్తం చేస్తున్నదేదో దాన్ని సమూలవిచ్ఛేదం చేస్తేగాని, మనిషి తనకుయోగ్యమైన విధంగా మనుగడ సాగించలేడన్నది ప్రేమ్‌చంద్ భావం. తక్షణ నివారణ లేందే బతుకు దుర్భరమవుతుంది. దీనికి అనువుగా పాఠకుల మనోభావలను మళ్ళించాలన్నదే అభిమతం. అంటే కళకు ఒక సామాజిక ప్రయోజనం వుంది. దేశం హాయిగా వున్నప్పుడైతే 'కళకోసమే కళ' అనుకోవచ్చు గాని, వివిధ రాజకీయ, సామాజిక బంధనాల్లో మనం చిక్కుబడివున్నప్పుడు దుఃఖం, దారిద్ర్యం తాలూకు దృశ్యాలను చూస్తూ కష్ట నిష్ఠూరాలతో వేగలేక జనం బాధాక్రోశాలు వింటూన్నప్పుడు ఆలోచనాపరుడైనవాడు చలించకుండా ఎలా

వుండిపోగలడు?"

పరాయి పాలనకుతోడు పేదరికం. వాస్తవజీవితం కటిక చేదు. ఒకడి నోరుకొట్టి ఇంకొకడు బాగుపడాలనుకొంటున్నాడు. పరస్పర ద్వేషం మానవ సంబంధాలను వికృతం చేస్తుంది. మతాల పేరుతో ఒకరి నొకరు హతమారుస్తున్నారు. వివిధ మతవర్గాల సామరస్యం అవసరం. 'కర్మభూమి' లో ఈ సంకుచిత పూర్వాచార పరాయణత్వాన్నే తాను ధిక్కరించింది. 'గోదాన్'లోనూ అదే. 'రంగభూమి'లో మత విద్వేషాలను చిత్రించాడు. మతవర్గవాదం మూలంగానే జాతీయవాదం భంగపడుతున్నదని రాస్తూ, దీన్ని పెకలించకపోతే మాత్రం "మనదేశం కలలోనే కమ్మగా వుంటుంది" అని హెచ్చరించాడు. దీనికి తగినట్టుగానే ప్రేమ్‌చంద్ సాహిత్య భాష అటు ఉర్దూగానీ, ఇటు హిందీగానీ కాకుండా 'హిందుస్తానీ' అయింది.

దేశ స్వాతంత్ర్యం మాత్రమే చాలదు. ప్రజానీకానికి ఆర్థిక స్వాతంత్ర్యం వుంటేనేగాని రాజకీయ స్వాతంత్ర్యం సార్థకం కాదు. గ్రామసీమల్లో భూస్వాములూ జమీందారులూ సాగిస్తూ వచ్చిన దుర్మార్గాలు చాలనట్టు, పాశ్చాత్య దేశాల సంపర్కం మూలంగా దూరివచ్చిన వర్తక సంస్కృతి తెచ్చిపెట్టసాగిన అనర్థాలు ఇన్నీ అన్నీకావు. ప్రేమ్‌చంద్‌ది రైతాంగ మనస్తత్వం. పరిశ్రమాధిక్యం వల్ల రైతునోట మన్ను పడుతుందనీ, పొలమూ పుత్రా పోగొట్టుకొని దోపిడీకి గురి అవుతాడనీ, జీవితమూ సంస్కృతీ భ్రష్టుపట్టి సమాజం అధోగతిపాలౌతుందనీ 'రంగ్‌భూమి' నవలలో ప్రకటించడమే గాక, 'మహాజనీసభయిత' లే వివరించాడు. యంత్రాల మీది ద్వేషాన్ని వాటిని చేయించే ఆర్థిక శక్తులమీదికి తిప్పడంలో ప్రేమ్‌చంద్ కొంతవరకైనా విఫలమయ్యాడు. ఈ విషయంలో శరచ్చంద్ర ఛటర్జీ కంటే మేలు. గాంధీతత్వం చింత విరిగినా పులుసు చావలేదన్నమాట. అయినా పెట్టుబడిదారులూ బ్యాంకర్లూ వారికి కొమ్ముగాచే ప్రభుత్వమూ ఒక వైపున, తమకు బానిసలుగా మారిన జనసామాన్యం మరో వైపున, ఇలా సమాజం రెండుగా విడిపోతున్న వికృత దృశ్యాన్ని చూపగలిగాడు. మరో అడుగు ముందుకేసి కూడా నిలిచాడు. దూరాన కనిపించే సూర్యోదయం సరికొత్త నాగరికతది. "కొత్త నాగరకతా సూర్యుడు...ధనిక స్వామ్యాన్ని కూకటి వేళ్ళతో పూర్తిగా పెరికినాడు." ఈ నాగరికత విశేషం, కాయకష్టంగానీ బుద్ధిశ్రమగానీ చేస్తూ ఏదో ఒకటి సృష్టించే పౌరులకు మాత్రం సమాజ సభ్యత్వం వుంటుంది. గౌరవం కూడా. పరాన్నభుక్కులూ పరకష్టోపజీవులూ పౌరసత్వానికి యోగ్యులు కారు. సోషలిస్టు సంస్కృతి ఇదే. దాని స్థూలరేఖలను ప్రేమ్‌చంద్ చూపాడు. ఇది చిన్న విషయం కాదు.

రాజకీయ ఇతివృత్తం ('సోజ్-ఎ-వతన్') తో ప్రారంభమైన ప్రేమ్‌చంద్ రచనలు, సంఘసంస్కరణ ('సేవాసదన్'), వర్గపోరాటం ('రంగ్‌భూమి') మీదుగా మళ్ళీ రాజకీయానికి ('కర్మభూమి') వచ్చి చేరాయి. చివరి నవల 'గోదాన్' లో రాజకీయాంశ వున్నా మానవ మహాప్రమేయం ముఖ్యమై సమున్నతమైన స్థాయిలో వుంటుంది. తనకొక నిశ్చిత సిద్ధాంతమంటూ లేదు. తాను ఏపార్టీకి చెందడు. 'అభ్యుదయ' అనే చీటీ కూడా అక్కరలేదన్నాడు. ఇలాంటి వన్నీ అనవసరం అని

తన అభిప్రాయం. "రచయిత గానీ కళాకారుడు గానీ సహజంగానే అభ్యుదయకరంగా వుంటాడు. తనకు ఈ స్వభావం లేకుంటే వాడు రచయితే కాడు."

తనది సాదా జీవితం. అంతా సమతలం. శిఖరాలుగానీ పాతాళ బిలాలు గానీ లేవు. అలాగని సాఫీ జీవితం కాదు. ఎగుడు దిగుడు లేకపోలేదు. పేదరికాన్ని స్వయంగానే అనుభవించాడు. అలాగే మధ్యతరగతి తృప్తినీ చవిచూశాడు. కష్టపడి పైకి వచ్చాడు. ఉద్యోగ జీవితంలో వూళ్ళూ బాగా తిరిగాడు. అయినా ప్రధానంగా ఇంటిపక్షే. పుట్టెడు కష్టాల్లో సైనా పొర్లిపొర్లి బిగ్గరగా నవ్వేవాడు. ఈ నవ్వే ప్రేమ్‌చంద్ జీవనతత్వం. నిరాశను దరికి చేరనిచ్చేవాడు కాదు. చివరిదాకా పనిచేస్తూపోయాడు. బతకనని తెలిశాక త్వరత్వరగా రచనలు చేసి కొన్నిటిని పూర్తి చెయ్యాలనుకొన్నాడు. 'మంగళ్‌సూత్ర' పూర్తి కానేలేదు.

మరో ప్రపంచయుద్ధం ముంచుకొస్తుంది. రాజకీయ నాయకులు, గొప్ప గొప్ప రచయితలూ కళాకారులూ కలవరపడసాగారు. రోమాంరోలాం, హెన్రీ బార్బ్యూజ్ ఉద్యమించారు. గోర్కీ కలిశాడు. నాగరికతను పరిరక్షించేందుకు పేరిస్ నగరంలో ఒక పెద్ద సమావేశం జరిగింది. ప్రపంచ శాంతి సదస్సు బ్రస్సెల్సులో సమావేశమయింది. జవహర్‌లాల్ నెహ్రూ ప్రసంగించాడు. ఈ అంతర్జాతీయ సంఘటన భారతదేశానికి తన సందేశాన్ని పంపింది. రవీంద్రనాధ్ టాగూరు, నందలాల్ బోసు, ప్రఫుల్ల చంద్రరే ఒక ప్రకటన పత్రం మీద సంతకాలు చేసి పంపారు. మరణశయ్యమీది నుంచి ప్రేమ్‌చంద్ సంతకం కూడా వుంది. రాజకీయ నవలల ద్వారా అపూర్వమైన ప్రాబల్యాన్ని కల్పించిన ప్రేమ్‌చంద్ కళకు గల సామాజిక ప్రయోజనానికి అమరణం నిబద్ధుడయ్యాడు. "బాబూరాజేంద్రప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూ లాంటి జాతీయ నాయకులను చూసి శ్రీ ప్రేమ్‌చంద్ గురించి ఆలోచిస్తే నా గుండె ఆనందంతో భక్తిభావంతో నిండిపోతుంది. రాజకీయం ముందు సాహిత్యం తలవంచుకొని గాకుండా తలెత్తి నిలుచుంటున్నది....ప్రేమ్‌చంద్‌జీ గొప్పవాడే కాదు, నిజానికి చాలా గొప్పవాడు" అన్నాడు హిందీ కవి నిరాలా. ఉన్నదే అన్నాడు.

# హరినారాయణ్ ఆప్టే



పేష్వాల పరిపాలన అంతరించి నలభైఏళ్ళు కావస్తున్నా చిత్పావన్ బ్రాహ్మణుల మనస్సుల నుంచి స్వాధిక్యతాభావం పోలేదు. కులం పట్టింపుల నటుంచి, పూర్వాచార పరాయణత్వం మహారాష్ట్ర సమాజ జీవితాన్ని భూతంలా ఆవహించింది. పాశ్చాత్య నాగరికతా సంపర్కాన్ని కంటగించుకొనే మనస్తత్వం వ్యాపించిన కాలాన జ్యోతిబాపులే వంటి గొప్ప సంస్కర్తలు ఏటికి ఎదురీదవలసి వచ్చింది. రనడే, చిప్లూంకర్, తిలక్, గోఖలే, అగార్కర్, రామాబాయి, వంటి గొప్ప వ్యక్తుల ప్రభావం గాఢాంధకారంలో కాంతిపుంజం.

మతం, రాజకీయం, సాహిత్యం వంటి జీవిత తలాలన్నీ కదలబారిన తరుణంలో తనదని ఒక నిశ్చితమైన స్థానాన్ని మలచుకోగలగిన ప్రతిభాశాలి హరినారాయణ్

ఆప్టే (1864–1919). రాజకీయంలో రనడేకీ అనుచరుడూ, గోఖలేకి మిత్రుడు సంఘసంస్కరణ విషయంలో అగార్కర్‌కు వాదోడు. ఒక సాహిత్య విషయంలోనే, అందులోనూ నవలా ప్రక్రియ విషయంలో, స్వయంసిద్ధుడు.

తెలివితేటలుండి లెక్కల మూలంగా చదువులో పైకి రాలేకపోయిన ఆప్టే, తన పినతండ్రి నెలకొల్పిన 'ఆనందాశ్రమ్' అనే మత విహిత సంస్థ నిర్వాహకుడుగా రాణించాడు. మత సంబంధమైన పాత మరాఠీ, సంస్కృత పుస్తకాల పునర్ముద్రణకు తోడుగా, 'మనోరంజన్', 'నిబంధనచంద్రిక' వంటి పత్రికలలోనే గాక, స్వయంగా స్థాపించిన 'కరమనుక్' పత్రికలోనూ రచనలు ప్రకటించాడు. 'కరమనుక్' అంటే మరాఠీలో వినోదం అని అర్థం. అగార్కర్ వంటి వాళ్ళలా గాక, పాఠకులను లాలిస్తూ మంచి సెబ్బరలు తెలియజెప్పాలి గాని, ఉగ్రంగా శాసించడం వల్ల లాభం ఉండదని ఆప్టే అభిప్రాయం. 'కాంతా సమ్మితం'గా ఉపదేశించాలంటూ అలంకారికులు నిర్దేశించిన మార్గాన్నే ఎంచుకొన్నాడు.

ఆప్టే సాహిత్య పునాది గట్టిది. విద్యార్థి దశలోనే మరాఠీ, సంస్కృతం క్షుణ్ణంగా చదువుకొన్నాడు. ఇంగ్లీషు బాగా ఒంటబట్టింది. కొంతకాలం తనకు ఉపాధ్యాయుడుగా ఉండిన అగార్కర్ షేక్స్‌పియర్ 'హామ్లెట్' అనువాదం ప్రకటించాక దాన్ని విమర్శిస్తూ ఆప్టే రాసిన వ్యాసాన్ని గురువే మెచ్చుకొన్నాడు. మత, విద్యా విషయాల్లో సంస్థాపకుల్పుడైన విష్ణుశాస్త్రి చింపుళ్లాంకర్ మరణాన్ని పురస్కరించుకొని సంస్కృతంలో 'శిష్యజనవిలాస' అనే కృతి ఆప్టే సాహిత్యానికి నాంది. కాళిదాస, భవభూతుల తారతమ్య పరిశీలనలో అగార్కర్ భవభూతిని పెద్దచెయ్యడం చూసి, కాళిదాసు రసహృదయాన్ని ఆవిష్కరిస్తూ ఆప్టే చేసిన రచన కూడా చెప్పుకోదగింది. రైనాల్డ్స్ నవలలు మొదట డికెన్స్, బ్రాంటీ, జేన్ ఆస్టెన్ నవలలదాకా, లాంగ్‌ఫెలో మొదలు షెల్లీ షేక్స్‌పియర్ కవిత్వం దాకా, ఎందరెందరి సాహిత్యాన్నో ఔపోసన పట్టాడు. జాన్ స్టూవర్ట్ మిల్ భావాలను మదికెక్కించుకున్నాడు. అంటే, పాశ్చాత్య స్వేచ్ఛావాద భావాలనన్న మాట.

ఎటొచ్చీ వీటిని అమలుపెట్టడమే కష్టంగా ఉండేది. క్రైస్తవ మిషనరీల టీ పార్టీకి వెళ్ళివచ్చారని రనడే వంటి పెద్దలనే వెలివేసి, ప్రాయశ్చిత్తం చేసుకొనేదాకా నానా ఇబ్బందులు పెట్టిన బ్రాహ్మణ్యం, తన ఇంట్లోనే వుమ్మడి కుటుంబం రూపాన ఆప్టేని కట్టుబడి పెట్టింది. పెద్దలంతా నిష్ఠాగరిష్ఠులు. అందుచేత ఆప్టే భావాల వేగాన్ని అచరణ అందుకోలేకపోయింది. ద్వితీయం చేసుకోవలసి వచ్చినప్పుడు ఎవరైనా బాలవితంతువును చేసుకుందామని ఎంతో ఇదిగా ఉండేదిగాని ఈ కోరిక నెరవేరలేదు. రెండో భార్య చదువుకొన్నదే అయినా ఆవిడను పదుగురిలో తీసుకుపోవడానికి పెద్దలదే అడ్డంకి. అయినా ఆప్టేవి సదాశయాలు కాదనలేము. స్త్రీ విద్య, వితంతు పునర్వివాహం, రజస్వలానంతర వివాహాల వంటి సంస్కరణాత్మక విషయాలన్నింటినీ తాను బలపరచడమే కాదు, వ్యాసాలు నవలల ద్వారా ప్రాచుర్యం కలిగించాడు. తిలక్‌వంటి వారితోటి విభేదించవలసివచ్చినా సందేహించలేదు. పూనే మునిసిపాలిటీ

అధ్యక్షుడుగా పౌరహిత కార్యకలాపాలలో శ్రమించాడు. ప్లేగ్ నివారణలో ఆప్టే కృషిని గుర్తించిన రాష్ట్ర ప్రభుత్వం 'కంపేనియన్ ఆఫ్ ది బ్రిటీష్ ఎంపైర్' అనే మెడలు పడవేసింది. హేమాహేమీలతో సమానంగా సామాజిక, రాజకీయ రంగాలలో కృషిచేసినా ఆప్టే స్థానం ప్రధానంగా సాహిత్యంలోనే.

ఆప్టే కవిత్వం చెప్పుకోదగింది కాదు. ఒక్క విశేషాన్ని మాత్రం చూపక తప్పదు. వీర గాథల ఫణితులను చప్పున చేజిక్కించుకోగల ఒడుపు ఉండేది. అన్యాపదేశంగా సక్కుబాయి కథను నాటి రాజకీయానికి అన్వయిస్తూ రాసిన నాటకం ప్రసిద్ధి పొందింది. సక్కు తిలక్, అత్త బ్రిటీష్ ప్రభుత్వం ఆడబిడ్డ దేశద్రోహుల బృందం. జైనకథనే 'మృచ్ఛకటిక' ఇతివృత్తాన్నీ మెదిపిన సత్ పింగళు గానీ, షేక్స్పియర్, కాంగ్రీవ్, విక్టర్‌యుగో నాటకానువాదాలుగానీ జనరంజకం కాలేదు. ముప్పయి దాకా కథలు రాసి, ఈ ప్రక్రియకు మరాఠీలో ఆద్యుడయ్యాడు.

ఆప్టే సాంఘిక నవలల్లో పూనే సమాజ జీవితం ప్రతిబింబిస్తుంది సాంప్రదాయికత కలిగించే అనర్థాలు, బ్రిటిష్ తాకిడి మూలాన కలిగిన బాగోగులు, తరణోపాయాల తీరు తెన్నులు, సంఘ సంస్కర్తల కృషి నవ సమాజం భవ్యరూపం వీటిలో కనిపిస్తాయి. ఒకే అర్థ శతాబ్దికి అవి అద్దం పట్టుతాయి. పత్రికల్లో ధారావాహికంగా ప్రకటిస్తూ వచ్చినందువల్ల ఈ రచనల్లో కథాబంధం పటిష్ఠంగా ఉండదు సరిగదా, ఎన్నో అతుకులు పెట్టినటట్టుంటుంది. ఒక నవల పాత్రలు మరో నవలలోకి దూరివస్తాయి. ఇలాంటి లోపాలు మరెన్నో ఉన్నా ఆప్టే వాస్తవచిత్రణ వీటికి ప్రాణం పోసి జీవకళ నిచ్చింది. చారిత్రక ఇతివృత్తాలలో రాసిన నవలలు పదిపన్నెండు దాకా ఉన్నా సాంఘిక నవలల వల్లనే ఆప్టేకి ప్రసిద్ధి. వాస్తవ జీవితం నుంచి వచ్చిన పాత్రలతోటి, స్వీయ చరిత్రాత్మక రచనా పద్ధతితోటి, అర్థవంతమైన ఘటనలతోటి ఈ నవలలకు సమాజ చరిత్రాభాస సమకూరుతుంది. ఉద్దేశపూర్వకంగా కొంటె మర్మాన్ని చొప్పించినందు చేత పాఠకుల ఆసక్తి పెరుగుతుంది. వాస్తవ చిత్రణే ఆప్టే నవలల ఆస్తిబలం.

క్షీణ సమాజ వికృత రూపాన్ని చూపుతూ వెలువడిన 'మధల్ స్థితి (విరామం) గిరసలు తొక్కుకుంటూ పరంపరగా 'గణ్‌పత్‌రావ్', 'పాన్ లక్ష్యత్' కోన్ ఘెటో (అయితే ఎవడికి లెక్క?), 'యశ్వంత్‌రావ్ ఖరే', 'అజాబ్' (ఈనాడు), 'భయంకర్ దివ్య', (దారుణ పరీక్ష), 'మాయేభ బజార్' (మాయాబజారు) వెలువడ్డాయి.

శిరోముండనం వల్ల హిందూ వితంతువులు అనుభవించే క్షోభనూ ఘోరి దుస్థితినీ 'పాన్ లక్ష్యత్ కోన్ ఘెటో' లో మనస్సు కరిగేలా చిత్రించాడు. మామ పాత్ర శంకర్ మామాంజీ పరమ రుద్మార్గమైన కుత్సితానికి పర్యాయపదమయ్యేలాగా రూపొందింది. ఈ నవల కలిగించిన సంచలనం అనన్యం. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ లొసుగులన్ని బట్టబయలయ్యాయి. 'యశ్వంత్‌రావ్ ఖరే' లో సమకాలిక రాజకీయాన్ని ఆప్టే చిత్రించాడు. సంఘ సంస్కరణ ముందా, రాజకీయ పోరాటం ముందా అంటూ అప్పట్లో చెలరేగిన వాదోపవాదాలలో బ్రిటీష్ ప్రభుత్వం సంఘ సంస్కర్తల

కిచ్చిన మద్దత్తు అతివాద రాజకీయ నాయకుల కార్యకలాపాల నెలా కుంటుపరిచిందీ ఈ నవల చూపెడుతుంది. కాని, రాజకీయాల లోతుల్ని తాకకపోవడం వల్ల వికృత చిత్రణ చేసినట్టయింది. తిలక్ గూడా సంస్కరణను వ్యతిరేకించలేదు. కాకుంటే దాని కది కాలం కాదన్నాడు. విష్ణుశాస్త్రి చిప్లూంకర్‌కు యశ్వంత్‌రావు నకలు అనుకుంటే ఆ మూలాన్ని చులకన చేసినట్టవుతుంది.

'మీ' అనేది మరింత మెరుగు. దేశాభిమానం కోసం ఎన్నెన్ని విషయాలను పరిత్యజించవలసి ఉంటుందో ఎంతటి ఆత్మోన్నతిని సాధించుకోవలసి ఉంటుందో 'భావ్' పాత్ర ద్వారా చూపుతుంది. ఈ పాత్రే భావానంద్‌గా పరిణమిస్తుంది. ఇందులో తిలక్ కనిపిస్తాడు. సన్యాసిగా యావజ్జీవం దేశాన్ని సేవించే ఈ పాత్ర నిజంగానే గొప్పది.

'భయంకర్ దివ్య' లో విద్యాధిక యువతి కమల, మగవారి అనుమానాల మూలంగా ఎన్ని కష్టాలు పడవలసి వచ్చిందీ యితివృత్తం. 'మాయేచ్ఛా బజార్'లో కూడా పద్మ అనే విద్యాధిక యువతి దురవస్థే కనిపిస్తుంది. భర్త దురాశను తీర్చలేదు. అతనిది రాపిచ్చి పద్మ భగ్న ప్రేమికుడు వసంతరావు యావజ్జీవ బ్రహ్మచర్యం పాలవుతాడు.

'అజాబ్' అసమగ్ర రచన. ఇంత క్రితం రాసిన వాటి పాత్రలు కొన్ని ఇందులోకి దూరివస్తాయి. జాతి పునరుజ్జీవనాన్ని ఉపలక్షించి ఆప్టే మనోభావాలను ఇది ప్రతిపాదిస్తుంది. రాజకీయ పురోగతిని కోరుకునే యశ్వంతరావు, సంఘ సంస్కరణకే అగ్రతాంబూలం ఇచ్చే గణ్‌పత్‌రావు, పారిశ్రామిక అభ్యుదయాన్ని వాంఛించే కృష్ణబాపు, జాతి సేవలో నిర్మలంగా ఉండదలచుకున్నవారికి సన్యాసాన్ని ఉపదేశించే అద్వైతానంద, ఒకరి నొకరు ఒరుసుకుంటారు. సర్వతోముఖాభివృద్ధి ఆప్టే లక్ష్యమనిపిస్తుంది. 'కర్మయోగ్' కూడా అసంపూర్ణం. నిరీశ్వరవాది, దేశాభిమాని అయిన చంద్రశేఖర్ అనే విద్యావంతుడు అద్వైతానందస్వామి ప్రభావంతో క్రమంగా పరివర్తనచెందే క్రమంలో, మతం ఆవశ్యకతను గుర్తిస్తాడు.

యశ్వంత్‌రావు, గణ్‌పత్‌రావు, భవానంద్, చంద్రశేఖర్ లాంటి పాత్రలు ఎంతో ఉదాత్తమైనవి. పాశ్చాత్య విద్య వాటి దేశాభిమానానికి అడ్డురాదు. గోవింద్‌రావు, శంకర్ మామాంజీ, రాజారామ్, చింతోపంత్ లాంటి పాత్రలు అత్యంత నీచమైనవి సుగుణ లేశమైనా వాటి కారునల్లనను చీల్చుకురాదు. ఇలా మంచిని ఒకవైపు, చెడును మరొకవైపు పోటీకి నిలపడం ఏ రచనకైనా శోభనివ్వదు. ఇలాంటి పాత్రీకరణ ప్రశస్తమైనది కాదు. స్త్రీ పాత్రల విషయంలో వివాహిత స్త్రీల సాంప్రదాయిక ఆదర్శాలను చూపెట్టేవి కొన్ని అయితే, సరికొత్త ఆలోచనలతో, నడవడులతో అప్పుడప్పుడే పైకి రాసాగిన యువమహిళల ఆకాంక్షలను చూపెట్టేవి మరికొన్ని. పాత్రనైనా సరే, తన అనుభవ పరిధినుంచే సృష్టించానని ఆప్టే స్వయంగా అన్నాడు. కల్పిత పాత్రల వాస్తవ రూపాలను ఆనాటి సమాజంలో ప్రత్యక్షంగా చూడవచ్చునని విమర్శకులు అంటున్నారు. ఇది అచ్చుకి మచ్చు పద్ధతి. ఇదే వాస్తవ చిత్రణ

అయినంతగా వాస్తవవాద విహితమైన చిత్రణ కాదు. మచ్చుతునక అనేది ఏ ఒక వ్యక్తికి నకలు  కాగూడదు. ఒకానొక సరళిని చూపెట్టే వ్యక్తులనేకులు స్ఫురించేలాగా వారి విలక్షణతలను మీరిపోగాల  సాధారణత్వం దానిలో భాసించవలసి ఉంటుంది. ఇలాంటి పాత్రలనూ ఘటనలనూ చిత్రిస్తేనే ఏ రచనకైనా పుష్టి.



# బంకించంద్ర ఛటర్జీ



బ్రిటీష్ వలసాధిపత్యానికి బెంగాలు, బీహారు, ఒరిస్సాలతో కూడిన విశాల, సంపన్న భూభాగం మొట్టమొదటి రక్తపు తిండి ప్లాసీ (1757), బక్సార్ (1763) యుద్ధాలలో బెంగాలు నవాబుల రాజ్యం పొందిన భంగపాటు, భారతదేశ రాజ్యాధికారంలో ఇంగ్లీషువాడి తొలిమెట్టు. ఇంగ్లీషు విద్యా విజ్ఞానాలు దేశీయుల మనస్సులను లోబరచుకున్నదీ కూడా బెంగాలులోనే. బెంగాలుకు పట్టిన దుర్గతి శేషభారతదేశ దుర్దశకు నాంది.

బ్రహ్మ సమాజం మతప్రభావం ఒకవైపు, క్రైస్తవ మతాంతీకరణ మరొకవైపు, ఆధునిక శాస్త్ర విజ్ఞాన తృష్ణ ఇంకోవైపు, డిరోజియో నాయకుడుగా విజృంభించిన 'నవబెంగాల్' తరం మూడోవైపు, రామమోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్

వంటి సామాజిక, సాంస్కృతిక, సాహిత్య సంస్కర్తల ధీర ప్రయత్నాలు నాలుగోవైపు బెంగాలును ముట్టడించి కుదిపివేశాయి. ఆ యుగ సంధిలోనే బంకించంద్ర ఛటర్జీ అవతరణ.

ఆంధ్ర ప్రచారిణి గ్రంథమాల ద్వారా తెలుగువారికి సుపరిచితుడైన బంకిం, బెంగాల్ సాహిత్యంలో 'ఆధునిక' శకకర్త. 'వందేమాతరం' గేయం ద్వారానే యావత్ దేశానికి తెలిసిన బంకిం రచించిన నవలలూ, ఇతర రచనలూ బెంగాల్ సాహిత్యానికి వరవడి. సర్ వాల్టర్ స్కాట్‌తోనే తనకు పోలిక కాని తాను ఏ అసలుకూ నకలు మాత్రం కాదు. తనది స్వతంత్ర సృజన.

1838లో పుట్టి 1894లో గిట్టిన 'కళా పునర్ వికాసం' మలిదశకు చెందిన వ్యక్తి. భావపరంగా తన రచనలలో దేశ, దేశాంతర ప్రభావాలు కనిపిస్తాయి. ఆగస్టికోట్ (Augaste Comte) మానవ వాదతత్వం (పాజిటివిజమ్) నూ, హైందవ మతతత్వాన్నీ అనుసంధానించిన బంకింలో హేతువాద దృక్పథంతోటి మత (ధర్మ) పరాయణత సమపాళ్లలో కనిపించినా, రెండోదాని ప్రాముఖ్యమే ఎక్కువ. కాకుంటే యూరోపియన్ దృక్కోణంనుంచి హైందవాన్ని వ్యాఖ్యానించాడు. మొత్తానికి బంకిం కళ్లు ఫాలభాగంలో గాక, ముచ్చైన గుంటలోనే అయినా, తాను సాంస్కృతికంగా ఇంగ్లీషు వాడి గులామూ? కాదు. దళారీయా? ఔనంటున్నారు కొందరు.

కవితలో రచన మొదలెట్టి ఈశ్వరచంద్ర గుప్తకు ప్రతిధ్వనిగా మాత్రమే ఉండగోరక బంకిం వచనానికి దిగాడు. డిప్యూటీ మేజిస్ట్రేట్, కలెక్టర్ హోదాలో ఎన్నో బదిలీలలో పనిచేస్తూ కూడా మొదట ఇంగ్లీషులో 'రాజసింహుని భార్య' (1864) అనే నవల రాశాడు. తర్వాత బెంగాలీలో 'దుర్గేశ నందిని' (1865), 'కపాల కుండల' (1866) 'మృణాళిని' (1869) 'విషవృక్ష' 'ఇందిర' (1873) 'చంద్రశేఖర్' 'కమలకాంతుని వీలునామా' (1875), 'రజని' 'ఉపకథ' (1877) 'రాజసింహ' 'ఆనందమఠ్' (1882), 'దేవీ చౌధురాణి' (1884), 'సీతారామ్' (1887) వంటి నవలలు రచించినాడు. నడుస్తూ, ఆగుతూ వచ్చిన సొంత పత్రిక 'వంగదర్శన్' లో గాక అనేక ఇతర పత్రికలలో రచనలెన్నో ప్రకటింపజేశాడు. హైందవ మతతత్వానికి సంబంధించిన అనేక రచనలతో పాటుగా బెంగాలీ సాహిత్యం, సాంఖ్యదర్శనం, లోక్‌రహస్య, విజ్ఞాన్ రహస్య ధర్మతత్వ, కృష్ణచరిత్ర వీటిలో ముఖ్యమైనవి. బంకిం రచనా పరిధి విస్తారమైనది. శైలి అప్పటికి సరికొత్తది. సాహిత్య సందేశం, మతాభిమానం తోటి గత చరిత్రాభినివేశంతోటి కలగలసిన దేశభక్తి. వీటన్నిటివల్లనే తాను శకకర్త అనిపించుకోగలిగాడు.

పేరెన్నిక గన్న నవల 'ఆనంద్ మఠ్'. "సుజలాం సుఫలాం మలయజ శీతలాం" అనే చరణంతో మొదలై, "వందేమాతరమ్" పల్లవిలా సాగే ఈగేయం ఆ నవలకు అంతటి వాసి కలిగించింది! బెంగాల్ రాష్ట్ర విభజన (1904) తర్వాత ఆధునిక భారత రాజకీయంలో ఉప్పెన అనిపించిన మొదటి ప్రజాందోళనను 'స్వరాజ్ ఉద్యమం' అన్నారు గాని, జనం నోటిలో అది "వందేమాతరం" ఉద్యమం అయింది. ఈ నవలా రచనకు ఎంతో ముందుగానే రాసిన ఆ గేయాన్ని నవలా క్రమంలో సత్యానందుడనే

పాత్ర నోటబెట్టి, గత వైభవాన్నీ ప్రస్తుత దుర్దశనూ భవానీ దేవిపరంగా చెప్పిస్తాడు అయితే, బహు ప్రసన్నంగా మొదట కనిపించే దేవి గేయంలో "బహుబల ధారిణీ" "రిపుదళవారిణీ" సాయుధమైన అష్ట భుజాలు గల కాళీ స్వరూపిణిగా మారుతుంది. ఎవరిమీద ఈ పోరు? శత్రువు లెవరు? ఇంగ్లీషు వారిని అన్యాపదేశంగా సూచించాడా? లేక, మొగలు సామ్రాజ్య పతనం తర్వాత బెంగాలు నవాబుల దుష్టపరిపాలనను ఖండించాడా? ఇది వివాదాస్పదం. అరవిందుని వంటివారు దీన్ని ఇంగ్లీషు చేశారు. 'వందేమాతరం' అనే మాట మంత్రంగా మారింది. యువకులనూ విద్యార్థులనూ దారుణ శిక్షలకు గురిచేసింది. రవీంద్రుని 'జనగణమన' తోటి పోటీబడి 'జాతీయ' గీతాలలో చోటు పొందింది. కవి అంతర్యం ఏమైనా, అది గొప్ప రచన.

బ్రిటిష్ రాజ్యస్థాపన ప్రారంభదశలో వారికి దివానీ అధికారమే వుండి, ముస్లిము నవాబుల కింకా నిజామత్ అధికారం వుంటూ వచ్చిన పరిస్థితి. కరువు కాటకాలు, పరాయివాడి దోపిడీ, జనసామాన్యం అసంతృప్తి. ఉత్తరాది నుంచి ఏటా వచ్చిపోయే నాగ సన్యాసుల దురాగ్రహం. ఫకీర్ల అలజడి. సన్యాసుల 'స్వాతంత్ర్య' పోరాటానికి జమీందారుల, భూస్వాముల ధాన్యం నిలువలను కొల్లగొడుతూ అన్నార్తులకు పంచుతూ వచ్చిన సాయుధ సన్యాసుల పట్ల జనసామాన్యానికి సానుభూతి. ఇంగ్లీషు సేవల పరాజయాలు. 'అనంద్‌మఠ్' ఈ సన్యాసుల అటవీ స్థావరం పేరు. తమకు తాము 'సంతానులు' (ఉన్నవ వారి 'మాలపల్లి' లో దర్శనమిచ్చే పేరు) అని పిలుచుకున్నారు. ఈ నవల ముస్లిం దుష్ట పరిపాలనకు నిరసనా? లేక పరోక్షంగా కుంఫిణీ దొరతనం పట్ల దెప్పా? నికరంగా చెప్పలేం కాని, వెనకటి చారిత్రక విషయాన్ని ఆదర్శీకరించిన ఇతివృత్తం తోటి ఈ నవల అనన్యమైన ప్రసిద్ధి పొందింది.

అలాగే, 'దేవీ చౌధురాణి' లో భవానీ ఫధక్‌తో యాదృచ్ఛికంగా కలిసిన దేవీ చౌధురాణి, అతని పథకం ప్రకారం కొంతకాలం, స్వతంత్రంగా మరికొంత కాలం, బెంగాలులోని అనేక నదులలో తిరిగే పడవలు సాధనాలు కాగా, స్వార్థం కోసం కాకుండా, ఎన్నో పెద్దచోరీలూ దోపిడీలు సాగిస్తుంది. అయితే చివరికి మాత్రం, శిక్షను ఎలాగో తప్పించుకుని, మనస్సు మార్చుకుని, సామాన్య గృహిణిగా పరివర్తనం పొందుతుంది. ఇది 'యాంటి- క్లైమాక్స్' లాంటిది. అయినా ఈ నవలకు బంకిం రచనలలో రెండో స్థానం లభిస్తుంది.

మధ్యయుగాల రాజపుత్ర క్షాత్రాన్ని వల్లమాలిన అతిశయోక్తులతో వర్ణించిన 'రాజసింహ'కు లభించని ప్రసిద్ధి 'సీతారామ్' కు లభించింది. మొదట ఎంతో మంచి వాడనిపించుకున్న ఈ జమీందారు, తన వుంపుడుగత్తె వ్యామోహంలో పడి చెడుతూ నైతికంగా భ్రష్టుడై , ప్రజల క్రోధాగ్నికి భస్మీ పటలం అవుతాడు.

మిగిలిన నవలలను స్థూల రేఖలలో నైనా వర్ణించడానికి స్థలాభావం అడ్డంకి. ఆగస్తికోట్ 'పాజిటివిజమ్' స్థాయి నుంచి హైందవ ధర్మతత్వ ప్రతిపాదనస్థాయికి దిగివచ్చిన బంకిం, సనాతనాచార పరాయణుండేమీ కాదు.

దురాచారాలనుంచి, మూఢ విశ్వాసాలనుంచీ హైందవాన్ని తప్పించాలన్నదే బంకిం

లక్ష్యం. ప్రాచీనకాలంలో రాజ్యాంతర చక్రాన్నంతటినీ తనచేతి మీదనడిపించిన కృష్ణుడు, బంకింద్రుష్టిలో అవతారపురుషుడనేకంటే, రాజ్యాంగ చతురుడనడం సరైన మాట. కృష్ణునిలాంటి దక్షుడు మళ్ళీ అవతరించకపోతే, ప్రస్తుతంలో దేశ రాజకీయం పూర్వపు స్వాతంత్ర్యాన్నీ ఘనతనూ మళ్ళీ పొందగలదన్నదే, బంకిం చెప్పక చెప్పిన సందేశం. కుంఫినీ కొలువుచేసినా, పూర్తిగా పరాయివాడికి దాసోహం అనలేదని మాత్రం చెప్పవచ్చు. అంటే సాంస్కృతికంగా పూర్తిగా పరాధీనుడు కాలేదన్నమాట.

రమేశ్ చంద్రదత్ వంటి కుంఫినీ వుద్యోగులు బంకిం ప్రేరణతోటి, 'మహారాష్ట్రజీవన ప్రభాతం' వంటి నవలలు రాశారు. వీళ్లెవరూ నేరుగా ఇంగ్లీషు దొరతనాన్ని ధిక్కరించలేదు. ఇదే వీరి లోపం. అందుకే 'దళారీలు' అన్నారు. అయితే ఈ ధోరణి, వెనకటితరాన్ని సరికొత్తతరం నెక్కిరించే ధోరణిలో భాగం. రామమోహనరాయ్‌కే ఈ నింద తప్పలేదు. ఇది అతి విమర్శ. భూస్వామ్యం ఇంకా బలంగా వున్న దశలో, ధనస్వామ్యం చరిత్ర గర్భంలోనే వున్న దశలో, ఇలాంటి వ్యక్తులనుంచి గొంతెమ్మ కోరికలు కోరడం, అనుచితం. వలసపాలనలో బతుకుతూ, ఉద్యోగరీత్యా, వృత్తిరీత్యా, విద్యరీత్యా, భావరీత్యా తమ పరాధీనతను మరిచి, ఏమరచి తాము స్వతంత్రుల మనుకునే 'అపచేతన్య' (ఫాల్స్ కాన్షస్‌నెస్) కు లోనుగావడమే వీరి అపరాధం. అందుకు వీరిని చిన్నబుచ్చడం గానీ వీరి విగ్రహాలను శిరచ్ఛేదం చేయడంగానీ, ఉన్మత్త కృత్యం. బంకిం లోపం గతకాలం మీదనూ మత ప్రమేయాలమీదనూ వల్లమాలిన అభిమానం. ఇది మరికొన్నేళ్ళకు దురభిమానంగా ముదిరింది. హైందవ పునరుద్ధరణనూ దేశరాజకీయ విముక్తిని కలిపి ముస్లిములను దూరంచేసుకుంది. ఎన్ని లోపాలున్నా బంకించంద్ర ఛటర్జీ సమ్మాన్యుడు.



# రవీంద్రనాథ్ టాగూరు



అద్దంలో కొండ కొద్దిగానే వుంటుంది. బహుముఖ ప్రజ్ఞావంతుడైన రవీంద్రనాథ్ టాగూరు (1861–1941) చిత్రలేఖనం మొదలు కవిత్వం దాకా ఎన్నెన్నో ప్రక్రియలను చేపట్టాడు. గల్పికలు, వ్యాసాలు, తత్వం, సంగీతం, రూపకాలు, నవలలు, కథలు – ఇలా వీటన్నిటినీ ప్రస్తావిస్తే చాలు – చిన్న పుస్తకమైనా అవుతుంది. "గ్రంధ విస్తరభీతి". "ఆదిలోనే హంసపాదు".

గురుదేవ్ అనిపించుకున్నాడు. విశ్వకవి అనిపించుకుంటున్నాడు. "సర్" బిరుదు అయాచితంగా వచ్చింది. "డాక్టర్" సరేసరి. 1913 లో సాహిత్యానికి నోబెల్ బహుమతి లభించింది. తద్వారా విశ్వసాహిత్య వీధిలో పెద్దరికం సమకూరింది. తన సాహిత్యానికి శాశ్వతత్వం కూడానా? ఇప్పుడే చెప్పడం కష్టం. బిరుదులూ,

ప్రశంసలూ తాము ఏ కవినీ నాలుగు కాలాల పాటు నిలబెట్టలేవు, కీర్తి ప్రఖ్యాతుల విషయంలో పరే - సాహిత్య పఠనీయత విషయంలో మహా మహితాత్ములకే గ్రహణాలు తప్పవు. టాగూరును ఈనాడు ఎవరూ అంతగా పట్టించుకోవడం లేదని అంటేనే - ఒకటి రెండు తరాలకే టాగూరు పాతబడిపోయాడని చెప్పే పని లేదు.

బెంగాలీ కాకుండా భారతీయుడు కాలేడు. భారతీయుడు కాకుండా - "విశ్వకవి" కాలేడు. టి.ఎస్. ఈలియట్ మాటల్లో - "రిప్రెజెంటేటివ్ పొయట్" కావాలంటే - ఇవన్నీ పుష్కలంగా వున్నప్పుడే సాధ్యం. అప్పుడే ఎవడైనా తన జనానికి ప్రతినిధిగా సాంస్కృతిక రాయబారిగా సాహిత్య ప్రపంచంలో వ్యవహరించగలడు. ఆ లక్షణాలన్నీ టాగూరులో వున్నాయని సుకుమార్ సేన్ లాంటి సాహిత్య చరిత్రకారులు రాశారు. అసలైన కవిత్వం సారం విశ్వజనీనం కావడం సర్వసాధారణమే. ఎన్ని ప్రభావాలు తనమీద పడినా, టాగూరు స్వయం ప్రతిభ అనన్యం కావచ్చు. భావ ప్రకటనా రీతులే విశ్వజనీనతకు తోడ్పడేటట్లు రూపొందాయనీ, భారతీయతా ముద్ర గాఢంగా పడినందుచేతనే, టాగూరు కవితకు లోకమాన్యత కలిగిందనీ అనడం జరిగింది. నిజా నిజాలు తేల్చడం కాలాన్ని పరీక్షకు పెట్టడమే. ఒకటి మాత్రం నిజం. ప్రత్యేకత లేనిదే సార్వజనీత లేదు.

ఉపనిషత్తులూ, కాళిదాస కృతులూ, వైష్ణవ "భక్తి" కవుల రీతులూ, గ్రామీణ "బావుల్" కవి గాయకుల పద్ధతులూ, టాగూరు కవితలోకి ప్రవహించి - దాన్ని మహా ప్రవాహినిగా మార్చాయనీ, అయినా పాండిత్యం శిరోభారం కాలేదనీ సుకుమార్ సేన్ రాశారు. పుట్టి పెరిగిన గడ్డమీదనే నిలిచాడు వృక్షం లాగా టాగూరు. విదేశీయమని అనిపించనే అనిపించదు ఆయన కవిత. తాను ఎవ్వరినీ అనుకరించలేదు. మైకేల్ మధుసూదన్ దత్ "మేఘ నాథ్ వధ" గానీ బిహారీలాల్ చక్రవర్తి వంటి వారి కాల్పనిక కవితగానీ, టాగూర్ రచనను లోబరచుకోలేకపోయింది. భారతీయ "కవితాత్మ" నుంచి తాను స్వీకరించినదంతా తనదని చెప్పదగిన మొహరుతోటి ప్రత్యక్షమవుతుంది. ఇలాంటి వర్ణనలు ఎవరైనా ఎవరి గురించైనా చెయ్యవచ్చు. అవి వట్టి "అభూత" పదార్థాలు కాకూడదంటే మాత్రం నిదర్శన బలం అవసరం. ఏ సంప్రదాయమూ అఖండ పదార్థం కాదు. "భారతీయ" సంస్కృతి అనేది కల్పన. ఇందులో వివిధమైన, ఒకప్పుడు పరస్పర విభిన్నమైన, విరుద్ధమైన ధోరణులు అనివార్యంగా వున్నాయి. పాలక వర్గాల సంస్కృతి పాలిత వర్గాలది కానక్కరలేదు గాని, సాధారణంగా పాలక సంస్కృతి పాలిత సంస్కృతిని గట్టిగా తాకుతుంది. అయినా, ఈ పాలిత సంస్కృతి తీరుతెన్నులు విలక్షణం కావడమటుంచి, బాధగానో, ధిక్కారంతోనో అది ప్రధాన ప్రవాహంలోనే మరో విడి పాయలాగా వుంటూ వస్తుంది. వచ్చింది కూడా. దీన్ని కూడా టాగూరు సొంతం చేసుకున్నాడా? అలా చేసుకోగలిగి వుంటేనే, అతని రచనలకు స్వజనీనత సమగ్రంగా లభించేది. టాగూరుకు అది అలివి కాలేదు. అందుకని, తన సాహిత్యం పాలక వర్గ సాహిత్యంలో అంతర్భాగమే. సమకాలిక వాస్తవాన్ని సవ్యంగా కూడా ప్రతిఫలించని టాగూర్ రచనలు, ఎంత గొప్పవని అనిపించుకోగలిగినా, కాలికంగా కూడా పాక్షికాలే. ఒక్క మాటలో, వర్గ పరిమితులను

అవి అతిక్రమించ లేకపోయినందుచేత ఆయన నిజంగానే – "రిప్రజెంటేటివ్ పొయట్" కాలేకపోయారు. ఇక "టిపికాలిటీ" మాట దేవుఁడెరుగు!

కార్న్‌వాలిస్ దొరతనంలో – రైతులకు చెందిన భూమి మీది హక్కుని తన తాబేదారైన దళారీలకూ, బన్యన్‌లకూ, గుమస్తాలకూ సంక్రమింపజేసింది కుంఫినీ (1793). వెనుకటి రోజుల నుంచీ – రైతుకీ, పాదుషాహీకి మధ్య నిలిచి వారిచ్చిన భూమి శిస్తుని ప్రభుత్వ ఖజానాకి చేరవేస్తూ ఈ "సేవ" కు గాను తాముూ కొంత మిగుల్చుకుంటూ వచ్చిన పాత జమీందారీలన్నీ యిప్పుడు శిథిలమయ్యాయి. కుంఫినీ విశ్వాసపాత్రులు వాటిని కొనేశారు. తామే జమీందారులయ్యారు. భూమి తమ బందీ. పండించేవాడికి దిక్కూ మొక్కూ లేదు. కుంఫినీ వాడి సాదర్ దివానీ అదాలత్ కలవాళ్ళ కొమ్మేగాచేది. పోనీ, తన అక్రమార్జనను వీళ్ళు కొంతమేరకైనా వ్యవసాయ విస్తరణకో, అభివృద్ధికో వెచ్చించేవాళ్ళా? కాదు. దాచుకునే వాళ్ళా? అదీ కాదు. జమీందారీ భూములిక్కడ. తమ అంగరంగ వైభోగాలు అక్కడ. కలకత్తా కాకుంటే మరో బస్తీలో నివాసం. సోమరి బ్రతుకు. అలా నడమంతరపు సిరి మురదనష్టం, వచ్చి పడి పైకి వచ్చిన కుటుంబాలలో ఈ టాగూర్లది ఒకటి.

తాత ద్వారకానాథ్ టాగూరు "ప్రిన్స్" అనిపించుకోగలిగాడు. దొరలతో తరచూ బుజాలు రాచుకున్నాడు. విందులూ, వేడుకల్లోనే కాదు, వర్తక వ్యాపారాల్లో కూడా వాళ్ళతో చేతులు కలిపాడు. ఒక ఉదాహరణ టాగూర్ అండ్ కార్ కంపెనీ, మరొకటి జోన్‌కి చెందిన ఒక బొగ్గు గనిని క్రయం చెయ్యేడం. సొంత చొరవతోటి నీలిమందు తోట వెయ్యడం, మరోవైపున రామ్ మోహన్ రాయ్ తోటి దోస్తీ, భావాలతో సామ్యం. ఎలాంటి భావాలు? సంస్కరణాత్మకమైనవి. దేని సంస్కరణ? మత సంస్కరణ. ఇంకా? సంఘ సంస్కరణ. రాజ్యాంగ సంస్కరణ? అమ్మయ్యో – అంత మాటే! పోనీ – వ్యావసాయక సంబంధాల సంస్కరణ? హతోస్మి!

పనిగట్టుకుని స్వక్షేమ దృష్టితో దొరలు ప్రాచీన "ప్రాచ్య" విజ్ఞానాన్నీ, సంస్కృతినీ మిన్నుల కెత్తుతూంటే ఆంగ్ల విద్యావంతులతో కూడిన **"భద్రలోగ్" కూటమి – "ఆహా!"**, **"ఓహో!"** అనిందే గాని, దొరల దుశ్చింతను గ్రహించలేదు. వేదాలను అనువదించడం, ఋగ్వేదాన్ని "ఎడిట్" చెయ్యడం – భగవద్గీత తర్జుమా, హిందూ కాలేజీ స్థాపన, కలకత్తా విశ్వవిద్యాలయ స్థాపన, సతీసహగమన నిషేధం, విధవా పునర్వివాహాలకు అనుమతి, వగైరా, వగైరా చర్యల ఆంతర్యం ఏమిటి? ఉపనిషత్సారమైన వేదాంత తత్వాన్ని ప్రశంసించడం, ఏ వుద్దేశం తోటి? ప్రస్తుత దాస్య దుస్థితి వైపు చూపులూ, తలపులూ మరలకుండా వాటిని బాగా వెనక్కు – "స్వర్ణ" యుగాలవైపు – మళ్ళిస్తే, ముస్లిం హయాము కంటే తమ పాలనే శాంతి భద్రతల విషయంలో నయం అనిపిస్తే, తమ దొరతనానికి అడ్డూ అపూ వుండదు, సరికదా, తాము సృష్టించిన కొత్త జమీందారీ, సర్కారీ వర్గాల నుంచి తమకు అండదండలు అడక్కుండానే లభించగలవు. తమ తమ లాభ క్షేమాల దృష్ట్యానైనా ఈ వర్గాలు తమకు దాసాన దాసులుగా వుంటాయి. ప్రజా సామాన్యం కోప తాపాల నుంచీ తిరుగుబాట్ల నుంచీ, "ఫితూరీ"ల నుంచీ, యీ దుర్భామాపరులు తమని ఆదుకుంటారు. మెకాలే

ప్రవేశపెట్టిన ఇంగ్లీషు భాషా బోధనలో కిటుకు ఇదే. "ఏ కోడ్ ఆఫ్ జెంటూ లాస్" పేరిట భూస్వామ్య యుగ ప్రాభవం నాటి మనుస్మృతిని మళ్ళీ న్యాయస్థానాల ద్వారా అమలుపరిస్తే పేదసాదలు మట్టిగొట్టుకుపోతారు. దొరలకూ, నల్లదొరలకూ ఉభయార్థ తారకం ఇదే. ఇది నయవంచన.

రామ మోహన్ రాయ్ కావచ్చు, కేశవ చంద్ర సేన్ కావచ్చు, "బ్రహ్మర్షి" దేవేంద్రనాథ్ టాగూరు కావచ్చు, మత సంస్కరణల పేరిట, మరో సంస్కరణ పేరిట, ప్రజాస్వామ్యాన్ని తమకు సుపరిచితమైన సాయుధ పోరాట సంప్రదాయం నుంచి తప్పించేందుకే పనికి వచ్చారు. జనం అలా దారి తప్పిపోలేదు, ఈ ప్రబుద్ధుల్లాగా. పేరుకు ఋషి గాని, దేవేంద్రనాథ్ కుటుంబ విషయాల్లో, ఆస్తి వ్యవహారాల్లో తలబంటి మునిగిన మనిషే.

రవీంద్రుడు బడి చదువులో ఆసక్తి చూపకపోవడం చూచి, ఇంగ్లాండుకి పంపి అక్కడ ఇండియన్ సివిల్ సర్వీసు (ఐ.సి.ఎస్.) లోనూ, అది తన్నేశాక బారిస్టర్ - ఎట్ - లా పరీక్షల్లోనూ నెగ్గేందుకు ప్రయత్నింపజేశాడు. రవీంద్రుడు ఆశాభంగం కలిగించాడు. కనీసం జమీందారీ వ్యవహారాలు చూడమని ఉత్తర బెంగాలులోని తమ జమీకి తోలేశాడు. ఇక్కడ మాత్రం "ఫెయిల్" కాలేదు. మొదట్లో ఎంత మొరాయించినా, తటపటాయించినా, చివరకు మాత్రం పులి కడుపున పుట్టేది పులి కూనే గాని మేక పిల్ల కాదని నిరూపించుకోగలిగాడు.

ఈ యవనవ్యసనం ప్రగల్భించిన దశలో రవీంద్రుడు, పితృవిధేయుడే అయినా, భావాల్లో పితూరీదారు అనిపించాడు. తండ్రి నిరంకుశ పద్ధతులను గుర్తించి కూడా, ఆయన ఋషిత్వానికి గూడా వారసు డనిపించుకోకుండా, తెల్లవాడి వ్యవహార సరళిని కంటగించుకుంటూ, భారతదేశం పండించిన పంట చైనా వాడి ఒంటికి పట్టించి నల్లమందు భాయీని చేస్తున్న దుర్మార్గాన్ని ఖండించాడు. భూస్వాముల సంస్థ అయిన 'బ్రిటిష్ ఇండియన్ సొసైటీ' సభ్యుడుగా 'బాబూ మహాశయ్' హోదాలో, తమ జమీ వుంటున్న పాబ్నా జిల్లా రైతులు జమీందారీ దోపిడీని ధిక్కరిస్తూ తరంగప్రాయంగా సాగించిన తిరుగుబాట్లనూ, రేపిన అలజడినీ రవీంద్రుడు పట్టించుకోకపోవడం అటుంచి, తీవ్రంగా ఖండించడం గమనించ దగిన అంశం. తన సమస్యేమిటో తనకే స్పష్టంగా తెలియని పచ్చి పిల్లకాయ దశే కావచ్చుగాని, ముందుముందు ఈ పిందే ముదురుతుంది, కాయగా, మగ్గుతుంది. పండుగా ఇది చిలక కొట్టిన కాయ. ముందొక నాటికి ఇది మేలిమిని సంతరించుకొంటుంది మేడిపండుగా. Child is the father of man - ఇప్పటి పసిబిడ్డే పెరిగి వ్యక్తిగా పరిణతి చెందుతుంది.

ధ్యానం, భావావేశ సంయమనం, పునశ్చరణం, ఆ తర్వాతనే కావ్య సృజనా వ్యాస రచనా, కథా కల్పనా వగైరాలు. పల్లెపట్టు పచ్చదనం, పద్మానదీ జల విహార ఆనందం, తిని కలలు కనగల తీరుబాటు. చిత్రవిచిత్ర భావాలను ప్రకటించేందుకు తగిన సుస్థితి, బుద్ధిని అంతర్ముఖీనం చేసుకుంటూ బాహిరవాస్తవ జీవితానుభవాల నుంచి గాక, భావాల నుంచే అనుభూతిని పొందగల అసాధారణ కల్పనా శక్తి, బెంగాలీ

భాషలో సయ్యాట లాడగల తగు మాత్రపు పాండిత్యం – రవీంద్రుణ్ణి రవి కవిగా మార్చిన విషయాలు. దొరబాబు యిలా రూపాంతరం చెందిన సీతాకోకచిలక.

కృత్తివాస రామాయణం, కాశీరామ్ మహాభారతం, కాళిదాసు మేఘదూతం, గీతగోవిందం, చండీదాసు, విద్యాపతి వంటి వైష్ణవ కవుల కీర్తనా సాహిత్యం. అన్న ద్విజేంద్రనాథ్ కావ్యం 'స్వప్నప్రయాణ్' ఇంగ్లీషు కవిత్వం – వీటి తోటి పరిచయం రవీంద్రుడి భావ పరిణతికి తోడ్పడింది. వైష్ణవ కీర్తనలను పోలిన వాటిని అనుసృజన చేస్తూ చేస్తూ, 'భానుసింహ' అనే మారు పేరు తోటి 'భారతి' పత్రికకు పంపి ప్రకటింపజేయడం, తన పదహారో ఏట మొదలైంది. 'భాను' లో వున్నది రవే. టాకూర్ కీ 'సింహ'కీ మాటల మార్పే. ఇంగ్లాండులో వుండిన నాళ్ళలోనే స్వకీయం అనదగిన గీతిసాహిత్యం మొగ్గ విడిచింది. 'సంధ్యాసంగీత్' ప్రచురణ కాలం నాటికి తన వయస్సు ఇరవై ఒకటి. అండదశ పిండ దశ.

అప్పటికీ భావ స్పష్టత లేదు. ఇదిగో అంటూ నిశ్చిత విషయం లేదు. తన సొంత గొడవలే. ప్రపంచంతోటి పొంతన లేదు. భావోద్రేకాల సుడిగుండంలో గిరగిరలాడుతున్నాడు మరు సంవత్సరమే వెలువడిన 'ప్రభాత్ సంగీత్' తోటి చీకటి తెర ఒత్తిగిల్లింది. తెల్లవారింది కదా, మిరుమిట్లు గొలిపే రేయెండలో విహరిస్తున్నాడు. వెనకటి నిస్పృహను తోసివేసింది జీవానంద పారవశ్యం. ఆ మరుసటేడు వచ్చిన 'ఛబీఓగాన్' (చిత్రాలూ గీతాలూ) తొలి దశలో చేసిన రచనల కూర్పే అయినా, సరికొత్త కవితలు లేకపోలేదు. ప్రణయం నిర్భరంగా వెలికురికే 'రాహుర్ ప్రేమ్', వానకురిసే రేయి ఉద్రేకాతిశయంలో బాధాక్రోశం ప్రకటించే 'అర్తస్వర్' చెప్పుకోదగిన రచనలనీ, వర్షారాత్రి టాగూర్ కవితలో పదే పదే రాశారు. 'కడీ ఒ కోమల్' సంపుటం – (1886) విశేషమల్లా, మాతృ సమానురాలైన వదినె మరణం కలిగించిన క్లేశం. రవీంద్రుణ్ణి ఇది గాఢంగా దృఢంగా కదిలించింది. భావసేతువు అవసరమైంది. ఇప్పుడు అభౌతికమైన ప్రాణిని ఆవహింప జేసుకునేందుకు ఇంతవరకు తాను రాసిన కవితలన్నీ సంగీతాత్మకమైనవి కాగా, 'మానసి' (1890) నుంచి భావాలకూ, ఆదర్శాలకూ మధ్య మొదలైన ఘర్షణ వల్ల క్రమంగా గాక, ఉన్నట్టుండి వచన రీతి ప్రారంభమైంది. వచన కవిత అనిపించుకోకున్నా, 'ముక్తచ్ఛందోరీతుల' ప్రాబల్యం కనిపిస్తుంది. పసితనాన 'హిందూమేలా' పేరిట తన చిన్నారి బుద్ధిని కదిపివేసిన హైందవ పునరుద్ధరణ ధోరణి ప్రస్ఫుటించిన వ్యక్తులు ఇప్పుడు విమర్శలకు అగ్గమయ్యారు. సమకాలీన జీవితం అసంతృప్తి కలిగించింది. సరిగా యిదే సమయానికి టాగూరు భావ స్రవంతి మలుపు తిరిగింది. పొంగు చల్లారింది.

ఇంకా చల్లారలేదు. ఇంగ్లీషు వాడంటే అరికాలిమంట నెత్తికెక్కిన రోజులవి. ప్రసంగాలలోనూ మంటలు కక్కే ధోరణి కనిపించిన రోజులవి. బంకిం చంద్ర ఛటర్జీని 'ఆనంద్ మఠ్' నవల విషయంలో ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించి చివరకు కాళ్ల బేరానికి దిగేలా చేసిన బ్రిటీష్ ప్రభుత్వం ఎన్నెన్ని రచనలనో నిషేధిస్తూ భావప్రకటనా స్వాతంత్ర్యాన్ని హరిస్తూ, పరమదుర్మార్గంగా వ్యవహరిస్తూ వచ్చిన రోజులవి. టాగూరుని మాత్రం మానాన పెడుతారా?

పెట్టరు గాని, జోకొట్టుతారు. మహా అంటే బెదిరిస్తారు. మొత్తానికి తమకు నష్టం లేని విధంగా అయనంతటి మనిషి భావాలనూ రచనలనూ పక్కకు మళ్లిస్తారు. మళ్లించారు. 'నైట్ హుడ్' ఇచ్చారు. తంత్రంచేసి 1913లో సాహిత్యానికి నోబెల్ పురస్కారం ఇప్పించారు. బెంగాలు విభజన (1904–5) సందర్భంగా బెంగాలీల నందరినీ తన పాటలతో జాతిగా రూపొందించాడని మనం అనుకుంటున్న కవిని బెదిరించారు కూడా. రాజకీయ వ్యాపకాల నుంచి తప్పుకునేలా చేయించారు. జాతీయతావాదాన్నే ఖండించేలా చేయించారు. బ్రిటీష్ ప్రభుత్వం మేలైనదని అనేలా చేయించారు. ప్రాక్ పశ్చిమ సమ్మేళనం పేర కుహనా అంతర్జాతీయవాదాన్ని భుజాన వేసుకొని ప్రపంచాన్ని చుట్టి వచ్చేలా చేయించారు. 'పొగరు' దించారు.

'బంగవాసి' పత్రిక మీద ప్రభుత్వం తెచ్చిన వ్యాజ్యంలో అది పేర్కొన్న సాక్షులలో టాగూర్ ఉన్నాడు. సాక్ష్యం చెప్పాడో లేదో వేరే విషయం. 'రాజద్రోహకరం' అని దొరతనం భావించిన ఆ పత్రికా వ్యాసాలను మూడింటిని తర్జుమా చేసే బరువునీ బాధ్యతనీ తన తలమీద మోపారు. శరచ్చంద్రఛటర్జీ నవల 'భారతి' ని నిషేధించ బూనినప్పుడు శరత్ ఎంత ప్రాధేయపడినా (1927) రవీంద్రుడు అతనికి తన మద్దతు నివ్వలేదు. జాతీయ విప్లవకారులను పరాయి ప్రభుత్వం పొట్టన బెట్టుకుంటున్నప్పుడు ఆ దేశాభిమానులను నిరసించాడు, గర్హించాడు. రవీంద్రుడు మాటల్లోనే కాదు, పాటల్లో, నవలల్లో. పాబ్నా రైంతాంగాన్నీ 'సంతాల్ తిరుగుబాటుదార్లనీ' తన జమీందారీ చూపుతో నిరాదరించిన వ్యక్తి తన 'ఘరే–బాయిరే' (ఇంటా బయటా, 1916) నవలలో సందీప్ పాత్రను వికృతం చేసి స్త్రీలోలుడుగా, ఉపన్యాస కేసరిగా, ధనలోలుడుగా చూపడం, నిఖిలేశ్ అనే జమీందారు పాత్రను ధీరోదాత్తంగా చిత్రించడం, ఇందువల్లనే 'చార్ అధ్యాయ్' (నాలుగు అధ్యాయాలు) నవలలో విప్లవతత్వానికీ, ప్రణయ తత్వానికీ మధ్య కృత్రిమమైన పోటీ పెట్టి, ఇంద్రనాథ్ పాత్ర ద్వారా అతీంద్ర అనే నాయకపాత్ర ద్వారా 'టెర్రరిస్టుల'ను నిరసించడం, వాళ్ళకూ ప్రేమకూ చుక్కెదురవడం, సార్వకాలిక నైతిక సూత్రాలను విప్లవతత్వం తెగదెంచి పోగుబెడుతుందనడం, విప్లవోద్యమం నిష్ఫలమౌతుదనటం, ఇందుకోసమే ఎన్నడో ఆ పిమ్మట ఈ జాతీయ విప్లవకారులైన సింహకిశోరాల గురించి కన్నీరు ఒలికించినా 'బాఘా' (పులి) జతీన్ వీరోచితంగా పోరాడి ప్రాణార్పణ చేస్తున్న కాలాన (1913) ఈ నవల వెలువడడం, ప్రభుత్వాన్ని ఎంత సంతోషపెట్టిందో! అందుకే తనకు నోబెల్ బహుమతి వచ్చిందేమో? అందుకే 'నైట్ హుడ్' గౌరవం లభించడమేమో? అందుకే తనకు ఏ ఆటంకము లేకుండా యుద్ధకాలంలో జర్మనీలో సైతం పర్యటించే సదవకాశం లభించిందేమో?

భావలోక స్వైరవిహారక్రమంలో రవీంద్రుడు 1896 లో 'చిత్ర', 'చైతాలి' 1899 లో 'కణిక', 1900 లో 'కల్పన', 'క్షణిక', 1901లో 'నైవేద్య' వంటి కవితా సంపుటాలను ప్రకటించాడు. అదృశ్య సూత్రధారిణిని ఒకప్పుడు మానవిగా, మరొకప్పుడు విచిత్రవ్యక్తిగా, ఇంకొకప్పుడు ఆదర్శ సౌందర్య ప్రతీక ఊర్వశిగా, కర్ణధారిణిగా, జీవన

నేత్రిణిగా, బహురూపిగా చిత్రించాడు. ఆయా కాలభేదాలలో కవితాశైలి మారుతూ వచ్చింది. 'కథా' శీర్షికతో కథాగేయాలు రాశాడు. మహాభారతం నుంచీ 'బౌద్ధ జాతక కథల' నుంచీ, మహారాష్ట్ర చరిత్ర నుంచీ శిఖ్ఖులచరిత్ర నుంచి ఎన్ని ఘటనలకో సాహిత్య రూపం ఇచ్చాడు. ఉదాహరణకు, 'చండాలిక' సమకాలీన ఘటనలు నిరసనకే తప్ప ప్రశంసకు పనికిరాలేదు.

'శాంతినికేతన్'లో బ్రహ్మచర్య విద్యాలయం (1901) తో మొదలై వృత్తి శిల్పవిద్యలు నేర్పడానికి 'శ్రీనికేతన్' స్థాపించి నిర్వహిస్తూ ఈ సంస్థలను యథార్థ రాజకీయాలకు అతీతంగా ఉంచ బూనాడు. 'ఖేయా' (తెప్ప) నుంచీ మార్మికత (మిస్టిసిజం) వైపు మొగ్గసాగాడు. కృష్ణభక్తి ఎంతో పనికి వచ్చింది. అంతర్ముఖీనుడయ్యాడు. 1905 మొదలు 1911 వరకు సాగిన కాలం వరకు సాగిన కాలం 'గీతాంజలి' దశలో క్రమంగా మళ్ళీ దంతప్రాకారంలోకి వెళ్ళడం కనిపిస్తుంది. 'గీతాలి', 'గీతమాల్య', 'గీతాంజలి' (1910) తర్వాత వచ్చాయి. ఉత్ప్రేక్ష కట్టలు తెంచుకుంది. సంగీతం ప్రగల్భించింది. అయితే భాష తేటపడింది. నడక సాఫుదీరింది. శబ్దలయ ప్రబలమైనది. 'బలాక' (1916) లో ఈ శైలి పరాకాష్ఠ పొందింది. బలాక పక్షులలాగా మానవులు నిరంతరం విశ్వయాత్రికులై తమ విధాయకాన్ని సాధించాలని కవి కోరిక. పాశ్చాత్య దేశాల దురాశాపరత్వం, ముఖ్యంగా ఆ దేశాల కార్మిక వర్గానికి ఉన్నదని రవీంద్రుడు నిర్దేశించిన ఈ దుర్గుణం, మొదటి ప్రపంచ యుద్ధానికి ముఖ్య కారణం అంటే, ఎవ్వడైనా ముక్కున వేలేసుకోవాలి. వేసుకు తీసిన తర్వాత ఆ ముక్కు చప్పబడిపోయేంతగా ప్రపంచాన్ని తలకిందులుగా, వాస్తవాన్ని వక్రంగా చూడసాగాడు 'విశ్వకవి'

మార్మికత (మిస్టిసిజం) రెండు విధాలు. ప్రపంచాన్ని నిరాకరించేది ఒకటీ, అమోదించేది మరొకటీ. రవీంద్రుడు ప్రపంచాన్ని రెండు చేతులా పొదివి పట్టుకున్నాడు. సాపేక్షంగా ఇది అభ్యుదయాత్మకమైన ధోరణి. గుడ్డిలో మెల్ల మేలు. అసలు మార్మిక దృక్పథమే సవ్యమైనది కాదు. తేటతెల్లంగా కనిపించే దాని మీద అడ్డు పొరలేమిటి? వాస్తవానికి పరదాలేమిటి? కబీరు పాటలను అనువదిస్తేనే చాలునా? కబీరు గానీ, 'భక్తి ఉద్యమం'లో మరే కవైనా గానీ, నిరసించింది లోకంలోని అంతర్విభేదాలనూ అంతరువుల దొంతరనూ అయినప్పుడు, కోరింది ఏదో విధమైన సమానతనైనప్పుడు, అరువందలేళ్ళ తదనంతరం మార్మికతను అభిమానించిన కవి మరి నాలుగడుగులు ముందుకు వేస్తాడని ఆశించడం సహజం. టాగూరు మార్మిక కవిత్వం ఈ ఆశను అడియాస చేసింది.

పేర్కొంటూ పోతే, టాగోర్ పద్య, గద్య రచనలకు అంతు వుండదు. పది చేతులతో రాశాడు. కవితలు, గల్పికలు, నాటికా నాటకాలు, కథలు, నవలలు, వ్యాసాలు, నృత్య రూపకాలు – ఇది శ్రీమదాంజనేయస్వామి వారి తోక. రచనలే రవీంద్రుడి జీవితంలో మైలురాళ్ళు. మరణించే దాకా ఆ కలానికి విసుగు విరామమూ లేవు. 'పూరబి' (19 25), 'మహుయూ' (1929), 'పరిశేష్' (1932), 'శేష్ సప్తక్' (1935), 'విచిత్ర' (1933), 'బీథిక' (1935 ), 'ప్రాంతిక' (1938), 'ప్రహాసిని' (1939), 'నవజాతక' (1940), 'రోగశయ్యాయ్' (1940), 'ఆరోగ్య'

(1941), 'జన్మదినే' (1941) మధ్యే మధ్యే మరెన్నో. 'జీవన దేవత' ఇంకా తనని ఆడిస్తూ పాడిస్తూ, రాపాడిస్తూ కూడా వుంది. సుఖ దుఃఖాలూ, ఆరోగ్య అనారోగ్యాలూ, స్మృతులూ నెమరు వేతలూ, అనుభవాలూ, అనుభూతులూ, యుద్ధప్రమాదమూ, క్రౌర్యమూ, ఘటనా ఘటనలూ, తన గుండెను గట్టిగా తాకి కవితలుగా రూపాంతరం చెందసాగాయి. దేశ రాజకీయం తనకు నచ్చకపోయినా, శ్లోక వృత్తం నుంచి కేటాపడిపోవడం, ఎవ్వరి విషయంలోనైనా సరే, అసంభవం. ఈ కవితలలో రవీంద్రుడు చూపిన రూప వైవిధ్యం గమనించదగింది. కొన్నిటిలో కవిత్వం ఉదాత్త వచన రూపం ధరించింది. మరి కొన్నిటిలో గానాత్మకమైన గేయ రూపం కనిపిస్తుంది. 'రవీంద్ర సంగీత్' అనే స్వకీయమైన బాణీకి అనువైన గీతి కావ్యాలు ఎన్నో.

సంగీత రూపకాలు రాసి ప్రదర్శించి నటించాడు టాగోరు. వీటిలో 'వాల్మీకి ప్రతిభ' మొదటిది (1881). మునికుమారుణ్ణి పొరబాటున చంపిన దశరథుని చర్య 'కాల్-మృగయా' పేరిట ఆ మరుసటి యేడులోనే వచ్చి ప్రదర్శితమయింది. ప్రణయానికీ, కర్తవ్యానికీ మధ్య ఘర్షణలో సన్యాసం తరణోపాయం కాదనీ, ప్రకృతి హృదయం తోటి సమ్మేళనమే సరైనదని 'ప్రకృతీర్ పరిశోధ్' (1884) చాటుతుంది. తన కథా కావ్యాలనే నాటకాలుగా మలిచి, 'నళిని', 'రాజా ఓ రాణి' (1889) వంటి వాటిని రూపొందించాడు. కర్తవ్యపాలనను ప్రణయావేశం కోసం బలిపెట్టిన విక్రమదేవుడూ, ఇది తగదని చెప్పిన సుమిత్ర, వీరి ఆశయాల సంఘర్షణలో ఆ రెండోది విషాదాంతమై కూచుంది. బెంగాలీ సాహిత్యంలో అనన్యమన్న పేరు తెచ్చుకొంది. 'విసర్జన్' (1890) వేదాంత రూపకం. ఉద్రేకం, వివేకం, అంధ విశ్వాసానికి పోటీగా విశాలమైన నిర్మమత్వం, సంకుచితమైన కర్తవ్య దృష్టి వంటి భావాలకు తగిన పాత్రలతో ఇది టాగూరు రూపకాల్లో ఉత్తమం అనిపించుకొంది. మహాయాన, వజ్రయాన, మంత్రయాన శాఖలుగా చీలి క్షీణించిన బౌద్ధం తన విహారాలలో ఎలా అతీత శక్తుల ఆరాధనకూ కఠిన తపశ్చర్యలకూ వామాచారాలకూ తావిస్తూ చివరకు నిష్క్రియకూ నీరసత్వానికీ అకరమై దేశ స్వాతంత్ర్య నష్టికి తోడుపడిందో తెలియజెప్పే 'అచలాయతన్' (1911), సామాజిక, బౌద్ధిక మాంద్యాన్ని కల్పనాత్మకంగా వర్ణిస్తుంది. ఆర్య, అనార్య సంస్కృతుల ఘర్షణ అంతిమంగా ఎలా సమ్మేళనగా పరిణమించిందో చూపెడుతుంది. మనిషి మంచితనం పటిష్ఠత పేర, జాతీయత పేర చలామణి అవుతున్న అధికార దౌష్ట్యాన్నీ, దురాశనీ దెబ్బతీసి, తన బలాన్ని నిరూపించుకుంటుందో సూచించే సంకేతాత్మక ఇతివృత్తం తోటి 'ముక్తధార' (1922) సహాయ నిరాకరణోద్యమ కాలంలో రాసింది. దాని ప్రభావం లేకపోలేదు. 'రక్త కరబి' (1924) లో కూడా ఇలాంటి ఇతివృత్తమే. నాగరిక ప్రపంచ జీవితాన్ని శాసించే అధికార దాహం, ధన ప్రలోభం, జన సామాన్యాన్ని ఎలా పశుతుల్యమైన, నిష్ఠురమైన, వికృతమైన జీవితానికి నెట్టివేస్తున్నాయో చెబుతూ ప్రకృతికి అనుగుణమైన సరళ సుందర జీవన విధానమే మానవాళికి అనుసరణీయమని సూచిస్తుంది.

టాగూరు కథలలో వస్తు, రూప వైవిధ్యం అనంతం. ప్రేమ నుంచి ప్రేతాత్మ

దాకా విస్తరించే ఇతివృత్తాలతో రాసిన ఈ కథానికలు నూరుదాకా వుంటాయి. కథనం విచిత్రంగా వుండదు. ఘటనల దొంతరలుండవు, నీతిబోధలు వుండవు. దౌర్భాగ్యపు బతుకులు ఈడ్చే సాదా మనుషులే కథావ్యక్తులు. కథానికా ప్రక్రియకు బెంగాలీలో రవీంద్రుడే నాంది. నవలలు అలా కావు. 'రాజర్షి' (1885) లో హృదయానికీ బుద్ధికీ ఘర్షణ హృదయానిదే గెలుపు. టిప్పేరా చరిత్ర ఘట్టం ఇతివృత్తం. దీనికి రెండేళ్ళ క్రితం రాసిన 'బౌరాకూరాణీర్ ఘాట్' (చిన్నమ్మగారి సంత)లో వంగదేశ ప్రభువు పొందిన పరాజయం మూలకథ. బంకించాయ కనిపిస్తుంది. గత చరిత్ర అబద్ధీకరణ ఆశయాకరణగా అభాన పొందుతుంది. 1902లో రాసిన 'ఛోఖేర్ బాలి' (కంటి మెర మెర పేరున తెలుగులో వచ్చింది.) కథావ్యక్తుల మనోభావాల వ్యాపుతో నడుస్తుంది. భారతీయ సాహిత్యంలోనే ఇది అపూర్వమని విమర్శకుల అంచనా. 'నౌకా డుబి' (నౌకాభంగం అని తెలుగు అనువాదం) మరి మూడేళ్లలో వెలువడింది. మొదటిదానిలో లాగా కాకుండా, వ్యక్తి జీవిత సమస్యలు సామాజిక ప్రమేయాలతో ముడిబడినట్లు ఇది రూపొందింది. 'గోరా' (1910) లో వ్యక్తి, సమాజం, రాజ్యం – వీటి పారస్పర్యం సమగ్రంగా చిత్రితమైంది. దేశభక్తి ఉన్నతస్థాయికి చేరుకున్న గోరా పాత్ర విశిష్టం. జాతీయ విప్లవకారులను వికృతంగా చిత్రించే ధోరణి (1916) 'ఘరే బాయిరే' (ఇంటా బయటా) లో మొదలై, 1934 నాటి 'చార్ అధ్యాయ్' లో పరాకాష్ఠ పొందింది. స్వాతంత్ర్యోద్యమం పట్ల గాఢాభినివేశం. యువ పోరాటకారులకంటే మెప్పుదల పైకి కనిపిస్తున్నా 'హింసాపూరిత విప్లవ' విముఖత మీదివాటెని కమ్మివేస్తుంది. పాఠకలోకం దీన్ని సమాదరించలేదంటే తప్పెవరిది?

రవీంద్రుడు కవీంద్రుడయితే కావచ్చు 'గురుదేవుడూ' కావచ్చు. 'విశ్వకవీ' కావచ్చు గాని, సమకాలిక వాస్తవ విషయాలకు పెడమొగం పెట్టాడు. అంతర్జాతీయతకూ జాతీయతకూ మధ్య వైరుధ్యం చూపడంతో సరిపెట్టుకోకుండా జాతీయవాదాన్నే నిరాకరించాడు. నిరసించాడు కూడా. జాతీయ విప్లవకారుల యువ రుధిర ధారల జలపాతాన్ని సరిగా దర్శించలేకపోయాడు. 1906 తరవాత తన లోకవైఖరిలో వచ్చిన పెనుమార్పు తోటి, తన యవ్వనదశలోని సామ్రాజ్యవాద వ్యతిరేకతనూ భూస్వామ్య వ్యతిరేకతనూ దేశాభిమానతత్పరతనూ తానే తోసివేసుకున్నాడు. 1901 నాటి కాంగ్రెసు మహాసభ కోసమని రాసిన 'జనగణమన' గీతం ఐదో జార్జి రాకను పురస్కరించుకుని అభినందన పూర్వకంగా రాసిందనే అపవాదు వ్యాపించడానికి పరోక్షంగా తానే కారణం అయ్యాడు. ఇది ఆత్మహత్య కాకపోవచ్చు గాని, ఆత్మాపచారమే.

అరవిందుడికీ రవీంద్రుడికి ఈ విషయంలో విభేదాలున్నా భారతదేశం పాశ్చాత్యలోకానికి యివ్వగల గొప్పవరం హైందవమతం అనేదాని గురించి మాత్రం పేచీలేదు. భౌతికం, ఆధ్యాత్మికం అనేది కృత్రిమ విభజన. మానసిక స్వేచ్ఛా విస్తరణ అంటూ నిరంతరాయంగా టాగూరు చేసిన కృషి మంచిదే కావచ్చుగాని, రాజకీయ, ఆర్థిక స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకూ దానికీ మధ్య పోటీ లేదనీ, లేకపోగా

ఇవి పుష్కలమైతేనే గాని అది సంపూర్ణం కాలేదనీ గ్రహించలేరు. రాజకీయ స్వాతంత్ర్యం ఊసే లేకుండా, సాంప్రదాయికమైన భారత సమాజ పునరుద్ధరణను కోరుతూ 1904 లోనే టాగూరు రాసిన 'స్వదేశీ సమాజ్' అప్పుడే ప్రమథ్‌నాథ్ రాయ్ చౌధురి వంటివారి విమర్శకు యోగ్యత సంపాదించుకొంది. బ్రిటిషు పరిపాలకుల పట్ల మెత్తదనాన్ని అటుంచినా, గ్రామీణ సమాజాన్ని ఆదర్శీకరించడం ఏం పని? స్వవర్గపరిమితుల పరిధిని దాటలేదంటే ఇదే. హితేంద్ర మిత్రా పుస్తకం 'టాగోర్ విదౌట్ ఇల్యూర్యుషన్స్' చదివితే ఎవరికైనా తెలుస్తుంది, రవీంద్రుడు నిజానికి ఏమిటన్నదీ.

వేషాన్ని చూసి భ్రమపడవలసిందే గాని, టాగోరు తాత్వికుడేమీ కాదు. జాతీయ కవిగా మానవీయ తాత్వికుడుగా గుర్తింపు పొందాడు. సోవియట్ రష్యాను దర్శించి ప్రశంసించాడు. అభ్యుదయ రచయితల సంఘాన్ని ఆశీర్వదించాడు. రోమాం రోలాం వంటి వారితో కలిసి ఫాసిస్టు వ్యతిరేక సంస్కృతి అవశ్యకతను ప్రకటించే పత్రంమీద సంతకం చేశాడు. ఇన్ని చేసీ, తాను వలసాధిపత్యాన్నీ ఆర్థిక సమానతనీ, సామాజిక పురోగతినీ గాఢంగా కాంక్షించలేదంటే చాలామంది ముక్కున వేలేసుకోగలరు. నిజం నిష్ఠూరంగా వుంటుంది.



# కేశవ్ సుత్



ఆప్టే చేతిలో మరాఠీ వచనం కుబుసం విడుస్తూంటే, కవిత్వం వెనకబడి పోలేదు. సుదూర కంఠస్వరాలకు నీరస ప్రతిధ్వనులు వినవస్తూ ఉండిన రోజుల్లో ఇంగ్లీషు కవిత్వం పుణ్యమా అని, మరాఠీ భాషలో కొత్త కంఠస్వరాలు వినవచ్చాయి. వాటిలో పేరెన్నికగన్నది కేశవ్ సుత్ (1866–1905)ది. కేవలం 132 కవితలతో కేశవ్ సుత్ మహాకవి అనిపించుకోగలిగాడు. అవి ఒక సంపుటంగా అచ్చుపడింది అతని మరణానంతరమే.

సరిగా ఎప్పుడు పుట్టిందీ అది ఎక్కడైందీ నికరమైన సమాచారం ఇప్పటికీ లేని గొప్పకవి కేశవ్ సుత్. రత్నగరి వద్ద కొలాంచే గ్రామానికి చెందిన చిత్పావన్ కొంకణస్థ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన కృష్ణాజీ కేశవ్ సుత్ గా ప్రసిద్ధికి వచ్చాడు.

అన్నదమ్ముల్లాగా ఉన్నత విద్యావంతుడు కాలేదు. గొప్ప ఉద్యోగాలూ చెయ్యలేదు. పేద బడిపంతులుగా పనిచేస్తూ కూడా తాను చదివిన చదువేదీ వృథాపోకుండా దాని ప్రభావం వల్ల పదికాలాలపాటు నిలవగలిగిన ఉత్తమ కవిత్వాన్ని ఇచ్చిపోయాడు. విద్యార్థిగానూ ఉద్యోగిగానూ ఎక్కడికి వెళ్ళినా వచ్చిన వారితో స్నేహం చెయ్యడానికి తనకు సహజమైన సిగ్గు బిడియమూ అడ్డురాలేదు. వార్ధాలో ఉండి చదువుకునే రోజుల్లో నారాయణ్ వామన్ తిలక్‌తోనూ, పూనాలోనైతే హరినారాయణ్ ఆప్టేతోనూ సన్నిహితంగా మెలిగేవాడు. సంఘ సంస్కరణోద్యమ నాయకుడుగా దేశానికంతటికీ తెలిసిన అగార్కర్ వద్ద శిష్యరికం చేశాడు.

చిన్నతనాన చదివిన సంస్కృత సాహిత్యం కేశవ్‌సుత్ చేత కాళిదాసు రఘువంశ అనువాద ప్రయత్నానికి ప్రేరణనిచ్చింది. అక్కడితో ఆగలేదు. శృంగార కావ్యాల ప్రభావంతో ప్రణయగీతాలు కొన్ని కేశవ్‌సుత్ లేఖినినుంచి బయల్పడ్డాయి. భాషమీద, శైలిమీద సంస్కృతం ముద్రగాఢంగా ఉండేది. శ్లోకఛ్ఛందస్సును పాటిస్తూనే ఇంగ్లీషు కవిత్వ రూపాల్లో ఒకటైన "ఓడ్" కు అమిరేలాగే దాన్ని నరిగూర్చే ప్రయోగానికి పూనుకొన్నాడు. ఈ మార్పుకి తోడుగా, కావ్యశబ్దాల విషయంలో వెనకటి కాఠిన్యాన్ని సమాసతత్పరతనూ వదిలించుకొని, ప్రకృతి కవితలు రచించాడు. వర్ణనాత్మకంగాని కవితల్లో గూడా ఇక్కడో మరొకక్కడో ప్రకృతి దూరివచ్చేది. 'గ్రామం', 'దీపావళి', 'వానలు' వంటి కవితలలో పండితులకు ఈసడింపు కలిగించే సాధారణ శబ్దాలను ప్రయోగించబూనాడు. వీటన్నిటినీ మించి, తన స్వీయానుభూతికి అత్యంత ప్రాముఖ్యాన్నిచ్చే ఆత్మాశ్రయ పద్ధతిని అనుసరించే రచనలు చేశాడు. ఇదంతా ఇంగ్లీషు కవిత్వ ప్రభావం ఫలితమే. తనకంటే ముందునుంచే కొందరు కవులు ఇంగ్లీషు కవిత్వాన్ని ఆనందించీ అనుకరించే ఈ ప్రభావం తన శైలిని పూర్తిగా మార్చివేసేంతంగా అంతరాంతరాల్లోకి చొచ్చుకొని పోయిందనడం అతిశయోక్తి కాదు.

ప్రకృతి పట్ల కేశవ్‌సుత్ వైఖరి పూర్తిగా విలక్షణమైనది. పక్షుల కలకూజితాలలో వర్షా సంగీతంలో ఇమిడి ఉన్న నిసర్గ సంగీతాన్ని ఎంతటి కవిగానీ మీరిపోజాలడనీ, సహజ రమణీయం ఎంత నవనవమో అంత చిరంతనమనీ భావించేవాడు. దాన్ని చూచి మైమరిచేవాడు. అది సృజనోత్సుకత కలిగించేది. సరళాతి సరళమైన భాషలో గాఢతరమైన యోచనాబలంతో ఎన్నో కవితలలో కొంకణ గ్రామీణ సౌందర్యదృశ్యాలు అచ్చుగుద్దినట్లు కనిపిస్తాయి. స్వీయానుభూతి ఇలా దివ్యమైన ఆకృతిని పొందిందని చెప్పవచ్చు.

ప్రేమ కవితకు గూడా తానే మరాఠీలో ఆద్యుడు. కాళిదాస భవభూతులను షేక్స్‌పియర్ వంటి ఇంగ్లీషు కవులతోటి ప్రేమ విషయంలో అనుసంధానింప చేశాడు. 'అమలిన శృంగారం' అనిపించే విధంగా అతిలోక ఆదర్శ ప్రేమను కాల్పనికంగా అసాధ్య ఆదర్శ సన్నిభంగా సంభావించాడు. విప్రలంభ శృంగారానికి ప్రణయవేదనకీ దానిలో తావులేకపోలేదు. సంభోగ శృంగారమే పరమార్థం కాదు. 'ప్రేమ పెన్నిధి' అని గురజాడ అన్నట్టుగానే కేశవ్‌సుత్ సైతం భావించాడు. ప్రేమ బజారు సరుకు కాదు. దివ్యమైనది, అతిలోకమైనది. 'పూలబాస'లో కనిపిస్తుంది. ప్రేమ ఉన్నచోట

నరకమైనా, స్వర్గతుల్యమౌతుంది. పసిపిల్లల్లో ఉంది. చుక్కల్లో ఉంది. మంచులో ఉంది. పాత జ్ఞాపకాల్లో ఉంది. సందె చీకటిలో ఉంది. గులాబి మొగ్గలో ఉంది. ప్రేమ సర్వవ్యాపి. ప్రేమే సర్వస్వం.

అంత క్రితం ఎన్నడూలేని ధిక్కార ధోరణిని మరాఠీ కవిత్వంలో కేశవ్‌సుత్ ప్రకటించాడు. పునరుద్ధరణ ధోరణులను తన దరికి చేరనివ్వలేదు. జాతి సర్వతోముఖంగా అభివృద్ధి చెందాలంటే ఇలాంటి కృత్రిమ ఆటంకలాన్నీ పోవాలన్నదే ఖండికలో దురాచారాల వల్ల, కవిత్వంవల్ల సమాజంలో నిలదొక్కుకొని ఉన్న అసమానతలు అన్నీ పైదొలగి పోవాలని పిలుపిస్తాడు. 'నవసైనికుడు' అనే ఖండిక గూడా ఇలాంటిదే.

అగార్కర్ ప్రభావం వల్ల కావచ్చు, మానవ సమానతా భావం కేశవ్‌సుత్‌కు పట్టుపడింది. 'తుతూరీ' (బూరా) అనే ఆయన భావం. గ్రామాల నుంచి ఎక్కువగానే రాసినా గ్రామీణ సమాజంలో గల భూస్వామిక సంబంధాలు వదావదలైపోతున్నాయని తాను గ్రహించకపోలేదు. 'తుతారీ' మొదటి ముసాయిదాలో అతి బాల్య వివాహాలనూ వితంతుల శిరోముండనాన్నీ ఖండిస్తూ వితంతు పునర్వివాహాలను, అస్పృశ్యతా నివారణను సమర్థిస్తూ రాశాడుగాని, రెండో ప్రతిలో వాటిని తొలగించడం జరిగింది. అంటే, ఆ భావాలు తన నుంచి పోయాయని అర్థం కాదు. కవితలో నేరుగా వీటిని ప్రస్తావిస్తే కవిత ప్రచారాత్మకం అవుతుందని సంశయించాడను కోవాలి.

కేశవ్‌సుత్ కవితలలో అతి ఉత్తమమైన వాటికి దీర్ఘ ఆలోచనాత్మకత ముఖ్యలక్షణం. కవి వ్యక్తి ఏకాంతభావాన్నీ ఒకానొక అజ్ఞాతమైన అనిర్వచనీయమైన దానికోసం తీరని తపననూ అవి ప్రకటిస్తాయి. ఇలాంటి చోట్ల కవికి మార్మికధోరణి తప్పదు. తాను ఆస్తికుడేమీ కాదు. నాస్తికుడూ కాదు. అజ్ఞేయవాది కావచ్చు. నిస్సంశయంగా కేశవ్‌సుత్ మానవతావాది.



# నానాలాల్



గుజరాతీ సాహిత్య పునరుజ్జీవం గత శతాబ్దం మధ్య కాలానికే ప్రారంభమయింది. భారతీయ సంస్కృతి సంప్రదాయాలను తోసివేయకుండానే, ఆధునిక పాశ్చాత్య సంస్కృతిలో మంచివని తోచిన వాటిని స్వీకరించే వైఖరితో సమన్వయ కృషి సాగింది. గుజరాతీ కవితలో, నర్మద్, దల్‌పత్‌రామ్ వచనంలో గోవర్ధన్‌రామ్ త్రిపాఠి యీ నవోదయ కిరణాలు. దీని పరాకాష్ఠ నానాలాల్ (1877–1946) సాహిత్యం.

ఉన్నత విద్యావంతుడైన నానాలాల్ దల్‌పత్‌రామ్ కుమారుడు. అధ్యాపకుడుగా, విద్యాశాఖాధికారిగా, స్వదేశ సంస్థానాల్లో దివాన్‌గా కూడా గొప్ప వుద్యోగాలు చేస్తూ వచ్చిన నానాలాల్ తాను 'గుజరాత్ తపస్వి' అని ప్రశంసించిన గాంధీ సత్యాగ్రహ పోరాటంలో ప్రభుత్వోద్యోగానికి స్వస్తి చెప్పి ఆ తర్వాత పాతికేళ్ళపాటు

సాహిత్య జీవితం గడిపాడు. కొంతకాలానికి గాంధీతో అభిప్రాయభేదం వచ్చింది తాను సంఘసంస్కర్త కాలేదు గాని తన కవిత్వంలో సంస్కరణ భావాలకు పూరా జాగా దొరికింది. కుల కట్టుబాట్లను వ్యతిరేకించాడు. బాల్య వివాహాలను కంటగించుకొన్నాడు. వితంతువుల పట్ల జాలి జూపడమేగాక వారి ప్రణయ వివాహాలను సమర్థించాడు. అస్పృశ్యత మీద ధ్వజమెత్తాడు. విద్యార్థులూ, యువజనులూ సంఘటితమవుతూంటే సంతోషించి వాళ్ళ వెన్ను తట్టాడు.

కవిత్వం ద్వారా పునరుజ్జీవన భావాలను వెదజల్లి ప్రపంచ స్థాయిని అందుకోగల కవిత్వాన్ని వెలయించాలని సంకల్పించుకొన్నాడు. కాల్పనివేశానికి స్వామి నారాయణ శాఖకు చెందిన వైష్ణవం తాలూకు పరిశుద్ధతా వాదాన్ని జోడిస్తూ, నైతికాదర్శకత్వాన్ని అవలంబించాడు. ప్రేమనూ భక్తినీ రంగరించి 'ప్రేమ భక్తి'ని రూపొందించాడు. నానాలాల్ ప్రేమతత్వం విలక్షణమయింది. ఇది అతిలోకం, అధ్యాత్మికం. శరీర స్పర్శ కళంకమనుకునే 'అమలిన' భావ పదార్థంగా ప్రేమను సంభావించాడు. దాంపత్యమైనా ఆత్మ దాంపత్యమేనన్నంత అసాధ్యమైన ఆదర్శాన్ని ప్రవచిస్తూ ఎన్నో కావ్యాలు రచించాడు. ఉన్న బాధలు చాలవన్నట్లు జీవితంలోకి పనిగట్టుకొని మరిన్ని బాధలను తెచ్చిపెట్టే ఏ పనీ నానాలాల్‌కు సరిపడదు. కొత్త కొత్త ఆశలను పల్లవింపజేసే ఉన్నతాదర్శాలతో గూడిన నవ సహజీవనాన్ని సంధింపజేస్తూ, ప్రేమద్వారా జీవితాన్ని ఆనందమయం చేసే పనికి కవులు పూనుకోవాలన్నదే నానాలాల్ అభిమతం. తన 'వసంతోత్సవ' కావ్యంలో దీన్ని బాహాటంగా ప్రకటించాడు. అందులో ఒక చరణాన్ని ఆధారం చేసుకొని, కాంత్ అనే కవి గుజరాత్ సాహిత్య పరిషత్ సమావేశంలో నానాలాల్‌ను 'ఉదిత పూర్ణ శశి' అని సంభావించడం జరిగింది.

తానే 'మహాకావ్యం' అని వర్ణించుకొన్న 'కురుక్షేత్ర' నిడివి వల్లనే ఆ పేరుకుతగుతుంది. మహాభారతంలోని వివిధ ఘట్టాలను వర్ణించే ఈ వీరకావ్యంలో కథాంశంకంటె చిత్రణకే ఎక్కువ బలం. దీన్ని 'ఎపిక్' అనడం కంటె సుదీర్ఘమైన భావ కావ్యం అనడమే సబబని విమర్శకులు తేల్చారు. అయినా ఇంత పెద్ద కావ్యాన్ని కడకంటా శక్తిమంతంగా నడపగలగడం మాటలు కాదు. నానాలాల్ చిన్నచిన్న వీర కావ్యాలు ఎన్నో రాశాడు గాని ఇందులోని తత్వ ప్రతిపాదన తక్కిన వాటిలో వుండే వీలు తక్కువ. సృష్టి లయాలను శాసించి నియమించే సుదర్శన చక్ర మహిమను వర్ణించాక ఆనందమయలోకం జనన మరణాలకావలే ఉన్నదని ప్రకటిస్తాడు.

అభినవ 'పురాణం' అని పేరుబడిన 'హరిసంహిత'ను నానాలాల్ పూర్తి చెయ్యలేదు. ఇది భాగవతాన్ని పోలిన రచన. ఇందులో 'భక్తిప్రేమ' సిద్ధాంతాన్ని వివిధంగా ప్రతిపాదించడం జరిగింది. ఈ గ్రంథాన్ని పట్టపుటేనుగు కుంభస్థలాన పెట్టి ఉత్సవం చేయించారు.

చరిత్ర నుంచీ పురాణాల నుంచీ మాత్రమేగాక, స్వ కపోల కల్పితంగా కూడా నానాలాల్ తన రూపక రచనలకు ఇతివృత్తాలు చేబట్టాడు. తాను ఆదర్శవాది కాబట్టి మానవ ప్రపంచాన్ని దుస్థితి నుంచి పైకెత్తి సంస్కరణ ద్వారా ఉన్నతిని కలిగించాలనుకొన్నాడు. ఈ రూపకాలకు సంధిబంధాలు పటిష్ఠంగా లేకపోయినా,

రచయిత భావోద్వేగ బలం మూలాన మాత్రమే వాటికి ఎంతో కొంత ఐక్యత సమకూరింది. గథే, షెల్లీ, టెన్నిసన్, షాల రచనల ప్రభావం వీటిమీద వున్నదని వీటి పీఠికలలో రచయితే రాసినదాన్ని బట్టి తెలుస్తుంది. ఇవన్నీ శ్రవ్య నాటకాలుగా ఎక్కువ రక్తికట్టడానికి కారణం, వాటి సంగీతాత్మక రచనా ధోరణి.

ప్రేమకు పెళ్ళి పర్యవసానం కావాలనుకున్నా ఇది శరీర సౌఖ్యవాంఛకు అతీతంగా వుండాలన్న అభిప్రాయం తోటి ప్రతీకాత్మకంగా రూపొందించిన 'ఇందుకుమార్' ఈ రూపకాలలో మొదటిది. 'ఇందు' శబ్దంలో చంద్రుణ్ణి సూచించినట్లే, నాయిక పేరు 'కాంతి'లో వెన్నెలను సూచించడం జరిగింది. పెద్దలు స్థిరపరచిన సాంప్రదాయిక వివాహాన్ని కాదంటూ ప్రేమికుడైన ఇందుకుమారుణ్ణే పెళ్ళాడగోరింది కాంతి. వైయక్తికమైన ప్రేమను గూడా అధిగమించిన నాయకుడు లోక శ్రేయం కోసం దేవాలయాన్ని నెలకొల్పి పాటుబడాలని నిర్ణయించుకొంటాడు. నాయిక అనుసరిస్తుంది. 'జయ–జయంత్'లో కూడా అతి మానుషమైన అమలిన ప్రేమకు అంకితమైన నాయకుణ్ణి సృష్టిస్తాడు. అయితే లోకానికి ఆధ్యాత్మిక పునరుజ్జీవనం కలిగించాలన్న తన కృషి సమగ్రం కావాలంటే జయ తనకు అవసరమని జయంత్ అనుకొంటాడు. వీరు ఒక్కటి అయినా అది అశరీర వివాహజీవితమే. ప్రేమించి కూడా పెళ్ళాడకుండా వుండిపోయిన నాయికా నాయక పాత్రలతో 'ప్రేమకుంజ్' రూపొందించింది. ఈ రూపకాలలో వీలు దొరికినప్పుడల్లా స్త్రీవిద్య గురించీ సమకాలిక జాతీయ, అంతర్జాతీయ ఘటనల గురించీ ప్రస్తావించకుండా వదల్లేదు. ప్రధాన కథకు సమాంతరంగా సాగే ఉప కథల ద్వారా వర్ణాంతర వివాహాలను సమర్థించడం జరిగింది. అశోకుని పుత్రిక 'సంఘమిత్ర' షాహెన్‌షా, అక్బరు, జహంగీరు, నానాలాల్ చారిత్రక నాటకాలకు ముఖ్యపాత్రలు. వీర పురుషులను వుగ్గడించే వైఖరి వీటిలో కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఎందరు గొప్ప ప్రవక్తలు వివిధ కాలాలలో ఎన్నెన్ని ఉపదేశాలు చేసి ఎంత శ్రమించినా ఇంకా లోకంలో దౌష్ట్యం వుండిపోయిందని భూమాత గోడుగోడవుతుంటే, ఆ ప్రవక్తలంతా రంగంమీదికి వచ్చే దృశ్యాలతోటి 'విశ్వగీతి' అనే రూపకం రూపొందింది. తన ఆదర్శ నైతిక తత్వాన్ని మరింత విపులంగా ప్రకటించడానికే ఇది నానాలల్‌కు ఉపకరించింది.

భావ కవితా ఖండికలలోనే నానాలాల్ ప్రతిభ ఎక్కువగా కనిపిస్తుంది. జానపద గీతాల బాణీలో రాసినవీ, రాస్ గీతాలను పోలినవీ, ప్రేమగీతాలూ, భక్తి గీతాలూ ఇలా వివిధంగా ఉన్నాయి. శబ్ద సంగీతం, ఊహాబలం, భావలాలిత్యం, వ్యంజనాశక్తి వీటి కాణాచి. నానాలాల్ కవిత్వంలోనే గాక, గుజరాతీ భాషా కవిత్వం అంతటిలోనూ ఇంత గొప్ప రచనలు లేవని విమర్శకుల అంచనా.

సంస్కృత శ్లోకఛందస్సులో గూడా రాయగల దక్షత తనకు వుందని నిరూపించుకొని నానాలాల్ సాంప్రదాయిక ఛందస్సులను విడివేసి శబ్దలయ ప్రధానమైన 'దోహాన్ శైలి' ని అనుసరించాడు. వాల్ట్ విట్మన్ వంటి పాశ్చాత్య కవుల 'వెర్స్‌లిబ్రే' వంటివి కాకపోయినా, షేక్స్‌పియర్ వంటి కవుల 'బ్లాంక్ వెర్స్'కు ఇది సమీప వర్తి.

గుజరాతీ సాహిత్య వసంతుడు నానాలాల్ ఆ భాషలో అనన్యమైన స్థానాన్ని

గేయకవిగా పొందాడు. నర్మద్, దల్‌పత్‌రామ్ వంటి పునరుజ్జీవన దశాకవులు ప్రారంభించిన నవ్యధోరణులన్నీ అతని సాహిత్యంలో వికసించాయి.

• • •

# ఫకీర్ మోహన్ సేనాపతి



రాజాలతో జమీందార్లతో బిల బిల లాడుతున్న ఒరిస్సా నుంచి మధ్యయుగాలను వెళ్ళగొట్టడం ఒకంతట జరిగే పనికాదు. బెంగాల్లో కాలూనక ముందునుంచీ పాశ్చాత్య వర్తక బృందాలు ఒరిస్సాలోని బాలసూర్ రేవు పట్నంలో ఫ్యాక్టరీలు వగైరా స్థాపించుకొని వుండేవి. కలకత్తా పాదాక్రాంతం అయ్యాక కుంఫినీ వారు బెంగాలునంతటినీ వశపరుచుకోవడానికి ఎక్కువ కాలమేమీ పట్టలేదు. బెంగాలంటే బెంగాలు మాత్రమేగాక, బీహారు, ఒరిస్సాలు కూడా చేరి వుండిన విశాలమైన పరిపాలనా విభాగమని అర్థం.

ఇంగ్లీషు చదువులతోబాటు వాటిలో గడిదేరిన బెంగాలీ బాబులు కూడా వచ్చి పరిపాలనా యంత్రాంగంలో దూరి పెత్తనం సాగిస్తూ వచ్చారు. ఎవరో బాగా

ఆస్తిపాస్తులున్న వారి బిడ్డలు తప్ప తక్కిన వారికి నిచ్చెన కింది మెట్టుకూడా అందేది కాదు. ఎక్కడో సుదూర గతంలో తమ పూర్వీకులు గొప్ప పదవులను అలంకరించాలనేందుకు గుర్తుగా 'సేనాపతి' అనే వ్యర్థపదం తప్ప మరేమీ మిగలని నిరుపేద కుటుంబంలో పుట్టిన ఫకీర్‌మోహన్ (1843 –1918) బతకడమే ఒకానొక ముస్లిం ఆశీర్వాదబలం వల్ల జరిగిందనుకొన్నా, ఇంట్లో నానమ్మే లేకుంటే బ్రజ్‌మోహన్ బట్టగట్టగలిగేవాడు కాదు. పెత్తండ్రి భార్య గీసిన గిరిదాటడు. మరిది కొడుకు పైకిరావడం ఆవిడకు సుతరామూ ఇష్టం లేదు. పదేళ్ళ ప్రాయంలోనే పల్లెపట్టు విడిచి బాలసూర్‌లో పొట్ట చేతబట్టుకొని రేవు వద్ద కూలిపిల్లవాడు కావలసి వచ్చింది. ఆ వూరు ఒకపుడు ఉప్పు ఎగుమతులవల్లనే పైకి వచ్చింది. ఎగుమతులను కట్టిపెట్టినా తయారీ కొనసాగుతూ వచ్చింది. అక్కడ దొరికిన చాకిరీయే తనకింత తిండి పెట్టింది. అక్కడే నాలుగు ముక్కలు అబ్బాయి. బెంగాలీ, పార్శీ, సంస్కృతం వంటి భాషల్లో ప్రవేశమైనా సరే ఎవరో పండితులు నేర్పితే కలగాలి. జ్ఞాన పిపాసను ఎందరెందరి వద్దనో తీర్చుకొంటూ, ఉప్పుశాఖ రద్దయ్యాక బలాదూర్‌గా తిరుగుతూ నానమ్మతో నైనా చెప్పకుండా ఒక మిషన్ స్కూల్లో చేరి కొత్త కొత్త విషయాలు నేర్చుకోసాగాడు. నెలకు ఇరవై అయిదు పైసల బడి జీతం కట్టలేక రెండో సంవత్సరం మధ్యలోనే చదువుకు స్వస్తి చెప్పాడు. ఆధునిక ఒడిస్సీ సాహిత్యకర్త బడి చదువు ఇంతే.

ఫకీర్ మోహన్ నేర్చిందంతా సొంతంగా నేర్చిందే. ఒక వైపున చిన్న బడిపంతులుగా పసి పిల్లలకు నేర్పుతూ మరో వైపున పెద్ద పిల్లాడై తాను నేర్వసాగాడు. మిషనరీల ఆశ్రయం, మిషన్‌స్కూలు హెడ్మాస్టరు పదవీ లభించాయి. బీమ్స్ లాంటి భాషావేత్తలకు ఒడిస్సీ వ్యాకరణ సూక్ష్మాలు విప్పి చెప్పగలిగాడు. బెంగాలీ, సంస్కృత వ్యాకరణాలు కూడా ఇంత కొద్ది కాలంలో తనకు వశమయ్యాయంటే ఎంత సాధనో వూహించవచ్చు. మాతృభాషలో అనేక విషయాల గురించి తాను రాసిన టెక్స్టు పుస్తకాలు ఎంతో పేరు తెచ్చిపెట్టాయి. బెంగాలీల అవహేళన ఆగిపోయింది. బెంగాలీ పత్రిక 'సోమ్‌ప్రకాశ్' లో తన వ్యాసాలు అచ్చుపడసాగాయి. మిత్రులను కూడగట్టి ఒడిస్సీ ముద్రణాలయాన్ని స్థాపించాడు. సాహిత్య పత్రిక 'బోధయూబొని' వార్తాపత్రిక 'బాలసూర్ సంవాదపత్రిక' ప్రారంభించాడు. ఒడిస్సీ బెంగాలీ భాష వికృతే అన్న బెంగాలీ బాబుల కుట్రను భగ్నం చేసి ఒరిస్సాలో ఒడిస్సీకి బోధనా భాష స్థాయి కల్పించాడు.

బీమ్స్ అనుగ్రహం వల్లనే ఫకీర్‌మోహన్ జీవితం మలుపు తిరిగింది. చిన్న చిన్న జమీందారుల్లో దివాన్‌గిరీ తన జీవితానుభవాన్ని బాగా విస్తరింపజేసింది. అయితే పేదరికమంటే ఏమిటో స్వయంగా అనుభవించిన వ్యక్తి జమీందారీ దుర్మార్గాలను సంస్కరించే పని కంటే ప్రజా కంటకుల అధికారం నిలబెట్టడం కోసం చేసిన సేవే ఎక్కువ. తేయాకు తోటలు వేయించడం, సంస్కృత పాఠశాలలు తెరిపించడం, ఇంగ్లీషు చదువులు ప్రవేశపెట్టించడం, పూలతోటలు వేయించడం, రోడ్డు సదుపాయాలు కలిగించడం లాంటి వెన్నో చేశాడు సరే, భూమి శిస్తు పెంచే లాగున కొత్త

సెటిల్మెంటులు ఏర్పాటు చేయించడం, ఆటవిక తెగ అయిన భూయాన్ల తిరుగుబాటును అణగ్గొట్టడం లాంటి పనుల ముందు అవి వెల వెల బోతాయి. కౌటిల్యుడిలాంటి మెకియావల్లీ రాజనీతిని అనుసరించాడని ఫకీర్ మోహన్ జీవిత చరిత్రకారుడు అతనికి కితాబిచ్చాడంటేనే చాలు.

ఫకీర్ మోహన్ సేనాపతికి ఇద్దరు విద్యాధికులైన సాహిత్య మిత్రులు దొరికారు. ఒకరు రాధాకాంత్ రే. మరొకరు మధుసూదన్ రావ్. ఈ ముగ్గురూ కలిసి ఆధునిక కావ్యసంపుటి 'కావ్యావళి'ని ప్రకటించిన 1872 వ సంవత్సరం ఒడిస్సీ సాహిత్యంలో నవ్యయుగారంభం. పన్నెండో ఏడు దాటకముందే కృష్ణకుమారి తనకు ద్వితీయంగా వచ్చి చేరింది. చదువు రాని ఈ ముదితకు పుత్రవియోగ దుఃఖం మాన్పుదామనుకొని రోజూ రామాయణాన్ని మహాభారతాన్ని ఆ తర్వాత ఉపనిషత్తులను ఒడిస్సీ ద్విపదల్లోకి అనువదిస్తూ వచ్చాడు. నిజానికి అది అనుసృజన. 'వ్యాసకవి' అనీ, 'సరస్వతి'అనీ పేరు వచ్చేంతదాకా ఫకీర్ మోహన్ సాహిత్య కృషి పలు తెన్నులు వట్టిపోయింది.

'ఉత్కళ భ్రమణ' అంటూ రాసిన పర్యటన గ్రంథంలో మాతృభూమిని సమగ్రంగా పద్యంలో చిత్రీకరించాడు. సరసమైన హాస్యం, ఒక్కొక్కప్పుడు వ్యంగ్యం, ఇందులో పూరా కనిపిస్తాయి. సమకాలంలోనే ప్రముఖులంతా బారు దీరుతారు. సామాజిక జీవిత చిత్రాలకు రాజకీయ పరిణామ వ్యాఖ్యలు జతకలుస్తాయి. చిన్న చిన్న ఖండికలు అసంఖ్యాకంగా రాశాడు. 'బౌద్ధావతార కావ్య' వంటి బృహత్ కావ్యాలూ రాశాడు. వచనానికి వస్తే మూడు గొప్ప నవలలున్నాయి. కథలూ బోలెడు. జనం మాట్లాడుకొనేట్టు రాశాడు. జనం గురించి రాశాడు. రెండు శతాబ్దాల ఒరిస్సా జాతీయ జీవితాన్ని తన రచనల్లో ప్రతిబింబింపజేశాడు. విశాలమైన, ఉన్నతమైన మానవతావాద ధ్వజాన్ని ఎగరేశాడు. ఆధునికతకు ద్వారాలు తెరిచాడు.

బెంగాలు నవాబు అలీవర్దీఖాన్ హయాములో మరాఠీ గుర్రపుదండు విరుచుకుపడి నానా బీభత్సం సాగిస్తూ వచ్చిన కాలాన, బెంగాలు - ఒరిస్సా సరిహద్దులో ఒక యాత్రికుల బృందం పడిన పాట్లు చూపెట్టడంతో మొదలై మరాఠీల భంగపాటుతో అంతమయ్యే విషయాన్ని ముందొక కథానికగా సృష్టించి, ఆ తర్వాత 'లఛ్చమ' అనే గొప్ప చారిత్రక నవలగా రూపొందించాడు. మరాఠీలను ఓడించి ఒరిస్సాను ఆక్రమించుకొన్న ఇంగ్లీషు కుంపినీ స్థానిక తిరుగుబాట్లను అణిచి రాజుల, జమీందార్ల భూములను స్వాధీనం చేసుకొన్నాక పాత నాణేలను రద్దు చెయ్యడమే గాక నడమంతరపు సిరిగాళ్ళను ప్రోత్సహించి పాత జమీలను అమ్మకానికి బెట్టి కొత్త భూస్వామ్య వర్గాన్ని సృష్టించిన వైనంతో 'ఛమానఅతగుంత' (ఆరెకరాలా ముప్పై సెంట్లు) నవలకు ఇతివృత్తమయింది. కొత్త భూస్వాములు భూమి ముక్కూ మొగమూ తెలీనివాళ్ళు. పల్లెటూరి రైతుల బాధలు వారికి పట్టవు. దొరల అండదండలుండబట్టి ఆసాముల ఆగడాలకు అంతుపొంతు లేదు. పట్నమంటే ఏమిటో చట్టమంటే ఏమిటో తెలీని అమాయకుల ఆస్తిపాస్తులు మాయావుల వాతబడుతున్నై. ఈ దురవస్థను ఆ నవల సవివరంగా వర్ణిస్తుంది. బ్రిటీష్ ఆక్రమణ జరిగిపోయిన చాలా కాలానికి గాని ఒరిస్సా ఆధునికతకు నోచుకోలేదు. బెంగాలీల ఆధిక్యాన్ని కాదని

ఒరిస్సాలో ఎట్టకేలకు ఇంగ్లీషు విద్యాబోధన మొదలయ్యాక హైస్కూలు చదువులకు చిన్న చిన్న ప్రభుత్వోద్యోగాలు లభించేవి. బతికి చెడిన కుటుంబాల పిల్లలు ఈ నౌకరీల పుణ్యమాని పల్లెపట్లు విడిచి పట్నాల్లో చేరి, అక్రమ పద్ధతులమూలంగా మళ్ళీ తమ కుటుంబాలను ఉన్నత స్థితికి తీసుకు వచ్చేందుకు ఎన్నెన్ని అడ్డదారులు తొక్కుతూ వచ్చారో 'మామూ' (మాను) అనే నవల చూపెడుతుంది. పాశ్చాత్యుల తాకిడి వల్ల ఒడిస్సీ సమాజం కదల బారింది. కులం పట్టు సడలింది. పెళ్ళిళ్ళ పేరయ్యలతో సంబంధం లేకుండా ఎవరికి నచ్చిన పిల్లను వాళ్ళు పెళ్ళాడవచ్చునన్న భావం విద్యావంతులలో కలిగింది. దేవుడి ఉనికిని ప్రశ్నించేంత దాకా పోతున్నారు ఈ నవయువకులు. ఈ కొత్త పరిస్థితులను 'ప్రాయశ్చిత్త' అనే నవల చిత్రిస్తుంది. రెండు వందల యాభై ఏళ్ళ ఒడిస్సీ సామాజిక, రాజకీయ పరిణామ దశావస్థలకు ఫకీర్ మోహన్ నవలలు అద్దం పట్టడమంటే ఇదే.

రచనల్లో బ్రిటిష్ పరిపాలన దుష్ఫలితాలను ఖండించినా, ఆ దొరతనం మూలాన దేశానికి చేకూరిన శాంతి పట్ల ఫకీర్ మోహన్‌కు అచంచలమైన గురి ఉండేది. తిలక్‌ను కలిసి మాట్లాడాడు గాని 1918 నాటికి గూడా గాంధీ ప్రస్తావనే లేదు. మడుగులాంటి దేశం నుంచి బ్రిటీష్ గద్దలను తరిమివెయ్యకపోతే దేశీయులకు చేపలు దొరకడం గగనమే నన్నట్లుగా 'ఛమాన అత్థగుంఠ'లో ఒకచోట రాసిన రచయిత దేశాభిమానాన్ని శంకించవలసిన పనిలేదు. సామాజికాచరణ కొన్ని సందర్భాల్లో మరో విధంగా వుండినా జనం గురించి ఫకీర్ మోహన్ తాపత్రయాన్ని కాదనడం వల్లకాదు. తన భాషనీ, తన జనాన్నీ తన ప్రాంతాన్నీ కేవలం స్వయంకృషి ద్వారా ఆధునికత ఆచరణలోకి తెచ్చి నిలిపిన ఇలాంటి రచయిత అరుదు.



# లక్ష్మీనాథ్ బెజ్బరూవా



**బ**ర్మావైపునుంచి వచ్చిపడిన సైనిక దాడులను తిప్పికొట్టాకగాని అస్సాములో బ్రిటీష్ ప్రభుత్వం కాలు నిలదొక్కుకోలేదు. హిందూ మతాంతీకరణ పొందిన అహోమ్ రాజుల పరిపాలనలో అస్సామీ మధ్యయుగ సంస్కృతి రూపొందింది. వైష్ణవ మతతత్వం అద్వైత ప్రభావంతోటి శంకర్ దేవ్, మాధవదేవ్ వంటి మహనీయ వ్యక్తుల ద్వారా అస్సాములో స్థిరపడిపోయింది. ఇప్పుడు క్రైస్తవం వచ్చింది. మిషనరీలు సాగించిన మతాంతీకరణ నటుంచి, అస్సామీ భాషకు వాళ్ళు చేసిన సేవ మరవగూడనిది. అయితే ఇంగ్లీషును తలకెక్కించుకున్న బెంగాలీ బాబులు ఒరిస్సాలో లాగే ఇక్కడ కూడా సాంస్కృతికంగా పెత్తనం చేస్తూ, అస్సామీ భాష కేవలం బెంగాలీ వికృతి మాత్రమే నంటూ మాతృభాషలో విద్యాబోధనను అడ్డుకొన్నారు. ఈ దుస్థితి నుంచి తప్పించి అస్సామీ భాషా సాహిత్యాలకు స్వతంత్ర ప్రతిపత్తిని

కలిగించిన వారిలో లక్ష్మీనాథ్ బెజ్బరూవా (1868–1938) ముఖ్యుడు.

ఇంగ్లీషు ముక్కైనా రాకపోయినా, తండ్రి పెద్ద బ్రిటీష్ ఉద్యోగి. అస్సామీ భాషలో చెప్పకోదగ్గ రచయిత కూడా. తరచు బదిలీల మూలాన కుమారుడి చదువుకు అంతరాయం కలగకుండా చూశాడు. శిబ్‌సాగర్‌లో ఉన్నత పాఠశాలా విద్యను పూర్తి చేసుకొన్న లక్ష్మీనాథ్ కలకత్తాకు వెళ్ళి బి.ఎ., ఎం.ఏ. డిగ్రీలు సాధించుకొన్నాడు గాని లా పరీక్ష తన్నేసింది. 'మహర్షి' దేవేంద్రనాథ్ టాగూరు మనుమరాలిని పెళ్ళాడాడు. మరో బరూవతో కలిసి కలప వ్యాపారం సాగిస్తూ ఎక్కడో ఒరిస్సాలో సాంభల్‌పూర్‌లో ఎక్కువకాలం ఉండిపోయాడు. అయినా సాహిత్యం ద్వారా అస్సాముకు ఎనలేని సేవ చేశాడు. మత తాత్విక గ్రంథాలు, వ్యాసాలు, కథలు, ప్రహసనాలు, గేయాలు, చరిత్రాత్మక నాటకాలు ఇచ్చి పోయాడు. అర్థ శతాబ్దం పాటు అస్సామీ సాహిత్య జీవితాన్ని శాసించాడు.

విదేశీ సంస్కృతి ప్రవాహాన పడికొట్టుకు పోతూ వుండిన అస్సామీ సంస్కృతిలో ప్రశస్తమైనవని భావించిన విలువలను నిలబెట్టాలన్నది బెజ్బరూవా సంకల్పం. గతం తోటి తెగదెంపులు పనికి రాక వున్నట్టీ పాతదన్న ప్రతిదాన్నీ నిర్విమర్శగా ఆమోదించడమూ పనికి రాదన్నాడు. అస్సామీ సాంప్రదాయిక సంస్కృతి తన మూలధాతువు. ఆంగ్ల సంస్కృతి తన వ్యక్తిత్వానికి మెరుగులు దిద్దింది. సి.కె. అగర్వాలా, హేమ్‌గోస్వామి వంటి నవ్యులతో కలిసి అస్సామీ సాంస్కృతిక పునరుజ్జీవనానికి కృషి చేశాడు. అగర్వాలా పత్రిక 'జానకి'కి తానే దన్ను. తన అధ్యక్షతన ఏర్పడిన 'అస్సామీయ భాషా ఉన్నతి సాధనా సభ' భాషా సాహిత్యాల అభివృద్ధి గురించి ఎన్నో మంచి లక్ష్యాలను ముందుంచుకొంది.

కాల్పనిక వాదం (రొమేంటిసిజమ్) ఇతర ప్రాంతాల సాహిత్యాల్లాగానే అస్సామీ సాహిత్యాన్ని గట్టిగా కుదిపివేసింది. ఇంగ్లీషు కాల్పనిక వాద కవులైన కీట్స్, షెల్లీ, బైరన్ల కావ్యాలను చదివి వున్నాడు. బెంగాలీ సాహిత్య ప్రభావమూ వుంది. బెజ్బరూవా కవిత్వం సంప్రదాయాన్ని బద్దలు కొట్టుకొని ప్రకృతి సౌందర్యాన్నీ ప్రణయ మాధుర్యాన్నీ దేశభక్తి ఉత్తేజాన్నీ ఆశ్రయించుకొంది. 'ధన్‌బారు అరురతని' వంటి పద్య కావ్యాల్లో బెజ్బరూవా ప్రతిభ జ్వాలలుగా భాసించిందని విమర్శకుల అభిప్రాయం. అలాగే 'ప్రియతమ సౌందర్య' అనే కావ్యంలో ప్రేయసీ శరీర లావణ్య వర్ణన అద్భుతంగా వున్నదని అంటారు. పల్లెపదాల అచ్చమైన అందాన్ని పుణికిపుచ్చుకొని కొత్త కల్పనలెన్నో వెలువడ్డాయి. మాటల పటాటోపాన్ని వదలి సరళమైన భాషలో సౌందర్యాన్ని పాడివాడు. మార్మికతను దరికి రానివ్వలేదు. దేశభక్తి గీతాలలో గత చరిత్ర ఘనతను సూచిస్తూ వీధి గాయకుని పాట బాణీలో రాసిన 'వీణ అరువరాగి' మంచి రచన బంకించంద్రుడి 'వందేమాతరం'లా ధ్వనించే 'ఓమోందేశ్' మాతృభూమిని 'సల్లలితధునీ పరీవృత' గా 'మధుర ప్రతిఫల సమృద్ధ'గా వినుతిస్తుంది. హేమ్ బరూవ సూచించినట్టుగా, లక్ష్మీనాథ్ కవితలో కానవచ్చే గాంభీర్య లోపానికి కారణం కవి మేధశ్శక్తి పండిపోవడమే కావచ్చు.

సామాజిక ప్రయోజన దృష్టి లేకుండా మానవ ప్రకృతి విచిత్రాలను చూపే

హాస్య నాటకాలనూ, ప్రహసనాలనూ రాసిన బెజ్బరూవా ఈ ప్రక్రియకు ఆద్యుడేమీ కాదు. సమకాలికులు రాసిన వాటికి ఇది తీసికట్టే. వీటిలోనూ లోతు లోపించింది. హాస్యం మోతాదు మించింది. పాత్రల ప్రవర్తన కొన్నిచోట్ల అసంబద్ధంగా వుంది. సన్నివేశ కల్పన సహజమనిపించని పట్లు కూడా ఎక్కువే. శబ్దాన్ని ఆశ్రయించిన హాస్యం ఉత్తమం కాదు. సామాజిక జీవిత పరిణామాల వల్ల విలువలు తారుమారైన పరిస్థితిలో మనుషుల మనస్సులు కూడా విచిత్రంగా మారినప్పుడు ఈ విడ్డూరాలను అవహేళన చెయ్యడానికి బెజ్బరూవా అనేక ప్రహసనాలు రాశాడు. 'లిటికాయ్', 'పచాని', 'చిక్కర్‌పతి నిక్కర్‌పతి' వీటిలో కొన్ని, కథావస్తువు బలంగా లేకున్నా మాటల గారడీ మూలంగా హాస్యాన్ని పుట్టించడం వీటి విశేషం. గోరంత లోపాన్ని కొండంత చేసి చూపే పద్ధతి మూలంగా వాస్తవాన్ని అతిక్రమించడం, మంచి గుణాలను సైతం వక్రంగా చూపడం కూడా జరిగింది. అయినా మంచి భాష వ్యంగ్య వైభవం ఈ లోపాలను కమ్మి వేసింది. చారిత్రక నాటకాలు ఇలాగుండవు.

గత చరిత్రను తవ్వి తలకెత్తి ప్రస్తుత రాజకీయ దైన్యాన్ని చూపెట్టే వుద్దేశ్యంతోటి బెజ్బరూవా నాటకాలు రాశాడు. బర్మావారి దండయాత్రల ఫలితంగా అస్సాం అనుభవించిన బాధలనూ, నాటక పాత్రల అంతఃకలహాల మూలాన కలిగిన దేశ దౌర్భాగ్యాన్నీ 'బెలిమర్'లో చూపాడు. అహోమ్ రాజ వంశ పతనంతో ఇది ముగుస్తుంది. షేక్స్పియర్ నాటకాల పద్ధతిని అనుసరించి రాసిన నాటకాలు మరి రెండు వున్నాయి. విరుద్ధ సిద్ధాంతాల ఘర్షణను వ్యక్తుల ఘర్షణతో అన్వయించడం ద్వారా గాఢమైన అనుభూతిని కలిగించే నాటకం 'జయ్‌మతి కువారి'. కొండలకూ, మైదానాలకూ మారే సన్నివేశాలతో ఒకచోట భావనామయమైన ప్రకృతి అందంతో బాటు పార్వతేయుల సరళ జీవనమూ మరో చోట రాజకీయ దుస్తంత్రమూ చూపెట్టే అవకాశం కలిగింది. మరోది 'చక్రధ్వజ సింహ', దేశాభిమాన పూర్వకంగా రచించిన ఈ చారిత్రక నాటకాలు ఆనాటి రంగస్థల ఉద్యమానికి పట్టుగొమ్మలయ్యాయి.

అస్సామీ సాహిత్యంలో కథా రచనకు ఆద్యుడు బెజ్బరూవా, పసివాళ్ళ కోసం జానపద కథల బాణీలు తీసుకుని వర్ణనలతో వారిని ఆకట్టుకొనే విధంగా మూడు సంపుటాల కథలు ప్రకటించాడు. కథా పాత్రలను రూపొందించే నేర్పుతో బాటు కథను ఆసక్తికరంగా నడిపే శక్తి బెజ్బరూవాకు పుష్కలంగా వుంది. అయితే జానపద అంశం లేకుండా రాసిన కథల్లో శిల్పశక్తి లోపించింది. వాటి పాత్రలకు జీవకళ లేదు. మొత్తం మీద చెప్పవలసి వస్తే విమర్శనా శక్తి పెరిగినంతగా తనలో సృజనాత్మక శక్తి పెరగలేదు. అస్సామీ నాగరక సమాజాన్ని బ్రిటీష్ పాలనలో మార్పు పొందసాగిన సమాజాన్ని ఈ కథల్లో చిత్రించాడు. బెంగాలులో మొదలైన బ్రహ్మసమాజ ఉద్యమం పూర్వాచార సంప్రదాయాలను ఎదుర్కొన్న దరిమిలా ఆ తరవాతి తరాల మనుషులు పాశ్చాత్య భావదాసులైన ఫలితంగా రూపొందిన సంకర మనస్తత్వాన్ని బెజ్బరూవా సాహిత్యం ద్వారా ప్రతిఘటించబూనాడు.

ఉన్నత కులాలకు చెందిన పదుమ్‌కువారి, ఫూల్ అనే యువతులిద్దరు సూర్య కుమార్ అనే యువకుణ్ణి ప్రేమిస్తారు. సూర్యకుమార్ పదుమ్‌ను మాత్రమే

ప్రేమిస్తాడు. అసాధారణ పరిస్థితుల్లో వారిద్దరూ చనిపోతారు. ఫూల్ వచ్చి ఆ ఇద్దరు గతించిన చోట ఆత్మహత్య చేసుకొంటుంది. 18వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన ఈ ఇతివృత్తాన్ని తీసుకొని రాసిన ఈ నవల అతి భావోద్రిక్తతను ప్రదర్శించలానుకొని తేలిపోతుంది.

ఆత్మాశ్రయ పద్ధతిలో అసంఖ్యాంకంగా వ్యాసాలు బెజ్బరూవా సృజనాత్మక శక్తికి మంచి తార్కాణాలు. హాస్యానికి హాస్యం ఉపదేశానికి ఉపదేశం దండిగా ఉన్న ఈ వ్యాసాలు సంస్కరణాత్మకమైనవి. ఉన్నదాన్ని ఉన్నట్టే చూపడు. విమర్శిస్తూ వ్యాఖ్యానిస్తూ పోతాడు. జాతి సంస్కృతిలోని మంచి విలువల్ని పాశ్చాత్య నాగరికత తాకిడి నుంచి ఎత్తి పట్టడానికి ఈ ప్రక్రియ బాగా తోడ్పడింది. సామాజిక జాగృతి నిండారిన ఈ వ్యాసాలు ఒక్కొక్కప్పుడు ప్రహసనాల్లా వుండటానికి కారణం వ్యక్తుల స్వభావాల్లోని ప్రత్యేక లక్షణాలను పట్టుకొని నమూనాలుగా చేసి చూపడమే. బెజ్బరువా హాస్యం మొరటుది. సూక్ష్మ విమర్శను కమ్మివేసేంత వికటంగా రూపొందుతుంది. అయినా అన్నింటికి ప్రాణశక్తి తన మానవీయతా దృక్పథమే. సంప్రదాయాన్ని పూర్తిగా వైదొలగించుకోకుండా మధ్యయుగాల వైష్ణవ భక్తికి సంబంధించిన మతతత్త్వ గ్రంధాలను రాసిన బెజ్బరూవా నవీనతను మొత్తంగా ఒప్పేసుకోలేదు. తనది సమన్వయ వైఖరి. అదేమైనా, తాను, తన సహచరులూ కలిసి అస్సామీ సాహిత్యంలో నవయుగాన్ని ప్రారంభించారు.



# ఉల్లూర్ యస్.పరమేశ్వర అయ్యర్



గత శతాబ్ది అంతంలోనూ ప్రస్తుత శతాబ్ది ప్రారంభంలోనూ మలయాళ సాహిత్యంలో ఒక పండిత చర్చ చెలరేగింది. కావ్యాలలో ద్వితీయాక్షర ప్రాస విధాయకమా, కాదా అంటూ కాకలుతీరిన పండితులు రెండు బృందాలుగా చీలిపోయారు. విధాయకమేనని కేరళవర్మ, కాదని రాజరాజవర్మ వివాదపడ్డారు. అప్పట్లో కేరళవర్మను గట్టిగా బలపరిచిన కవి పండితుల్లో ముఖ్యుడు, ఉల్లూర్ యస్.పరమేశ్వర అయ్యర్ (1877–1949). అప్పటికి తానింకా యువకుడే అయినా సంస్కృత పండితుడుగా ప్రసిద్ధి పొందాడు. కాలక్రమంలో మహాకవి అనిపించుకోగలిగాడు.

నేటి కేరళ రాష్ట్ర ఉత్తరాదిలో శతాబ్దాలుగా స్థిరపడిపోయిన ఒక తమిళ బ్రాహ్మణ కుటుంబానికి చెందిన పరమేశ్వర అయ్యర్ చాలా కష్టపడి చదువుకొని పైకి వచ్చిన

వ్యక్తి. గుమస్తాగిరి నుంచి తిరువాంకూరు సంస్థానం సేవలో దివాన్‌షేష్కార్ పదవిదాకా ఎదిగాడు. సంస్కృత తమిళ, మలయాళ భాషా సాహిత్యాలతోపాటుగా ఇంగ్లీషులో కూడా పాండిత్యం సంపాదించాడు. ధారణాశక్తికి పెట్టింది పేరుగా తన ప్రజ్ఞను అనేక సాహిత్యేతర రంగాలలో నిరూపించుకొన్నాడు. కుమారన్ ఆశాన్, వల్లతోల్ నారాయణ మీనన్‌లతోబాటుగా ఆధునిక మలయాళీ సాహిత్యంలో మరొక మహాకవి ఉల్లూర్.

బాల్యం నుంచీ సంస్కృతం చదువుకొంటూ వచ్చిన ఉల్లూర్ తన సాహిత్య జీవితంలో సాంప్రదాయిక పంథాలోనే కొంత కాలం ప్రయాణించడం ఆశ్చర్యకరమేమీ కాదు. ఆ పంథాను వదలి రాగలగడమే ఆశ్చర్యకరం. కాల్పనికవాద ధోరణిని అవలంబించి అనేక కావ్యరచనలు చేసినా, పాండిత్య భారం నుంచి గానీ, సంప్రదాయ బలం నుంచి గాని పూర్తిగానే బయటపడలేకపోయాడు. ముందు పేర్కొన్న ఆశాన్‌లోనూ వల్లతోల్ లోనూ సాంప్రదాయికతా ముద్ర లేకుండా పోలేదు. అంతకంటే ఎక్కువగా అది ఉల్లూర్‌లో కనిపిస్తుంది. ఆధునికత విషయంలో ఉల్లూర్ తతిమా ఇద్దరికంటే వెనకబడినట్టే లెక్క. అంతమాత్రాన ఆయన సంప్రదాయానికి బానిస అని మాత్రం అర్థంకాదు.

మలయాళీ భాషాభివృద్ధిని తన లక్ష్యం చేసుకొని ఉల్లూర్ రచించిన 'ఉమకేరళమ్' మహాకావ్యంగా ప్రసిద్ధి పొందింది. సంస్కృత కావ్యాల బాణీలో అలంకార బాహుళ్యంగా కఠిన సంస్కృత శబ్ద భూయిష్ఠంగా సాగిన ఈ రచనకు తిరువాంకూర్ సంస్థానం గతచరిత్ర ఇతివృత్తాన్ని సమకూర్చింది. ఆ తర్వాతి దశలో ఖండకావ్యాలను లెక్కకు మిక్కుటంగా రచిస్తూ 'కిరణావళి', 'తారాహారం', 'తరంగిణి' వంటి అనేక సంపుటాలుగా ప్రకటించడం జరిగింది. కావ్య వస్తువులోనూ రచన పద్ధతిలోనూ మార్పు రాసాగింది ద్రవిడ ఛందస్సులను ప్రయత్నపూర్వకంగా స్వీకరించడం మరో విశేషం. ఈరచన లన్నిటిలోనూ కవితాలూకు గాఢానుభూతి అత్యంత సాంద్రంగా కేంద్రీకృతమయింది. అయితే కల్పనా సౌందర్యాన్ని మించిన ఆలోచనాపరత్వం ఉన్నందుచేత వీటిలో ఉపదేశాత్మకత అతిశయించిందని విమర్శకులు లోపమెన్నారు. ఉల్లూర్ కవిత అంతటికి గూడా ఇలాంటి గుణలోపమే వర్తిస్తుందని రాశారు. పూర్తిగా కాదనేందుకు వీలుగాక పోయినా, ఇలాంటి విమర్శలో సహృదయత లోపించిందని చెప్పవచ్చు.

మూడవ దశకు చెందిన ఉల్లూర్ రచనలో పేర్కొనదగ్గవి రెండు. మొదటిది 'కర్మభూషణమ్', రెండోది 'పింగళి'. మొదటిదాన్ని మహాభారతం నుంచీ రెండవదాన్ని భాగవతం నుంచీ తీసుకున్నాడు. కురుక్షేత్ర యుద్ధానికి ముందురోజున సూర్యుడు వృద్ధ బ్రాహ్మణరూపంలో వచ్చి, సహజ కవచకుండలాలను మారువేషంలో రానున్న ఇంద్రుడికి దానం చెయ్యవద్దనీ, అందుమూలంగా వినాశనం చెందవద్దనీ ఎంత మొత్తుకున్నా కర్ణుడు ససేమిరా వినడు. పింగళ అనే వేశ్య విటులెవ్వరూ రాని రోజునే ఏకాంతంలో అంతరాత్మ ప్రబోధానికి లోనై చివరకు దివ్యప్రేమను గుర్తించి హృదయ పరివర్తనం చెందుతుంది. ఈ రెండు రచనల్లోనూ నాటకీయత పుష్కలంగా

ఉంది. సంభాషణల ద్వారా, స్వగతాల ద్వారా గాని, మనస్తత్వ నిరూపణకు అవకాశం ఎక్కువ. ప్రాచీన భారతీయ జీవనాదర్శాల పట్ల ఉల్లూర్‌కు ఆరాధనాభావం విపరీతం. సమకాలికుల ప్రవర్తనను ఆ వెలుగులో దిద్ది పైకెత్తడమే తన కోరిక. కేథరిన్ మేయో భారతదేశాన్నీ, భారతీయుల్నీ న్యూనపరుస్తూ, రాసిన 'మదర్ ఇండియా' కు జవాబుగా ఉల్లూర్ 'చిత్రశాల' అనే కావ్యంలో ప్రాచీన భారతీయ మహిళామణులను కొలువు దీర్చాడు. 'అన్నమ్ ఇన్నుమ్' (అప్పుడూ ఇప్పుడూ) వంటి ఖండకావ్యాలలో కూడా కొట్టవచ్చినట్టు కనిపించేది గతచరిత్ర ఆదర్శీకరణమే. ఇలాంటి రచనలకు మరొక సామాన్య లక్షణం సంస్కృత శబ్దబాహుళ్యం, అతి పేలవమైన వర్ణనాచాపల్యం.

చివరి దశకు చెందిన ఉల్లూర్ ఖండకావ్య సంపుటం 'మణి మంజూష'. ఆయన రచనల కన్నిటికీ ఇది శిఖరప్రాయమైనది. ఇందులోనూ అత్యుత్తమమని ఎంపిక చెయ్యదగిన ఖండిక 'ప్రేమసంగీతం'. మలయాళ సంస్కృత శబ్దాలను చాలా అందంగా పోహళించి విశ్వప్రేమ గురించీ విశాల మానవ కుటుంబం గురించీ మనోహరంగా గానం చేసిన ఈ కావ్యం మలయాళ సాహిత్యానికే అలంకారం లాంటిదని అంటారు. అయితే అలాంటి భావాలనే 'ఐక్యగీత' 'భావనాగతి' వంటి ఖండికలలో కూడా ఉల్లూర్ ప్రకటించి ఉన్నాడు. తిరువాన్కూర్ సంస్థానంలో హరిజనుల దేవాలయం ప్రవేశం గురించి హర్షామోదాలు ప్రకటిస్తూ రాసిన 'చైత్రప్రభావం', శబరిమల గురించి రాసిన 'శరణాగతి' గాని, వాటి ఉపదేశాత్మకత కారణంగా ప్రశస్తమైన రచనలని అనిపించుకోలేదు. అయితే ఈ దశలోనే ప్రకటించిన 'భక్తి దీపిక' అలాకాదు. ఆదిశంకరుని శిష్యుడైన ఒకడు సాక్షాత్కరించుకోజాలని నరసింహస్వామిని ఒకానొక అస్పృశ్యుడు సాక్షాత్కరించుకోగలుగుతాడు. ఈ కావ్యంలో తత్వవిషయ భారం ఎక్కువే. అయినా సనందనుడి ప్రేమతత్వ ప్రస్తావన దాన్ని కొంతవరకు కాపాడుతుంది. మొత్తానికి ఉల్లూర్ కవితల ముఖ్యమైన లోపం వాటి ఉపదేశాత్మకత. ఇందువల్ల దెబ్బతినిందల్లా వాటి కావ్య ప్రతిష్ఠ.

ఉల్లూర్ వచన రచనలు కూడా అనేకం ఉన్నాయి. ఐదు సంపుటాలుగా వెలువడిన 'కేరళ సాహిత్య చరిత్రం' వాటిలో మొదట పేర్కొనదగింది. దీన్ని పూర్తి చెయ్యడానికి పన్నెండేళ్ళు పట్టింది. ఒకవైపు ఎన్నెన్నో ఉద్యోగాలు చేస్తూ మరోవైపు దాదాపుగా ముప్పై రచనల దాకా చేయడమంటే మాటలు: కాదు. ఉల్లూర్‌లో పాండిత్యం అతిశయించి ఉండవచ్చు. కవిగా ఆయన గొప్పదనానికి ఇది ప్రతిబంధకమమేమీ కాదు.



# కుమారన్ ఆశాన్



గత శతాబ్దం అంతానికి గూడా మలయాళీ భాషలో కావ్య రచన సంస్కృత కావ్య సంప్రదాయ ప్రభావం నుంచి బయటపడలేదు. వెన్మణి వుద్యమం ద్వారా కావ్య భాషా స్వరూపంలో పెద్ద మార్పు వచ్చింది. సంస్కృత భాషా శబ్దాల ప్రాబల్యం తగ్గి దేశభాషలోని శుద్ధమైన, సరళమైన శబ్దాల తోటి కావ్యాలు రచించడం మొదలైంది. అయితే యీ కొత్త రచనలలో గూడా శృంగార రసాధిక్యతే ఎక్కువగా వుండేది. అభినవ సంప్రదాయవాదాన్ని విడిచి ఖండ కావ్యాలలో కాల్పనిక భావ వైఖరిని ప్రదర్శిస్తూ ఎందరో కొత్త కవులు ముందుకు వచ్చారు. సుప్రసిద్ధ కవి పండితుడైన రాజరాజ వర్మ యీ ధోరణిని బాగా ప్రోత్సహించాడు. కుమారన్ ఆశాన్ (1873–1924), ఉల్లూర్ ఎస్. పరమేశ్వర అయ్యర్, వల్లతోల్ నారాయణ

మీసన్‌ల ఉజ్వల భావ కావ్యాల మూలంగా మలయాళీ కవిత్వంలో కాల్పనిక ధోరణి ఉచ్చదశను అందుకొంది. మొదట్లో ఈ ముగ్గురూ సంప్రదాయ వాదులే గాని, త్వరలో దాన్ని బద్దలుగొట్టుకుని కాల్పనిక వైఖరిని అవలంబించారు.

'మహాకావ్యం' అంటూ తాను ఏదీ రాయకపోయినా కుమారన్ ఆశాన్ మహాకవి అనిపించుకో గలిగాడు. ఇది చిత్రమైన విషయం. కుల భేదాలు మిక్కుటమైన మలయాళీ సమాజంలో తరతరాల నుంచీ విద్యా సంస్కారాలకు దూరమైన ఏరువ (తియా) కులంలో పుట్టిన కుమారన్‌కు చదువు సంధ్యలు అబ్బడమే ఒక విచిత్రం. మహాకవి అనిపించుకోగలగడం ఇంకా విచిత్రం. శ్రీనారాయణ గురు సంస్కరణ కృషి ఫలితంగా కులం పైకి రాసాగింది. పసితనం నుంచి ఆ సంస్కర్త ఆదరాభిమానాలను పొందగలిగినందుచేత ప్రాథమిక స్థాయితోనే బడి చదువుకు స్వస్తి చెప్పి వుండిన కుమారన్ మొదట బెంగుళూరు లోనూ, తర్వాత కలకత్తాలోనూ చదువుకొనే అవకాశం కలిగింది. సంస్కృత భాషా సాహిత్యాలతో బాటుగా తమిళం, ఇంగ్లీషు భాషా సాహిత్యాలలో సైతం ప్రావీణ్యం సంపాదించాడు. బెంగాలీ కళా పునర్వికాసం ప్రభావం కుమారన్‌మీద గాఢంగా వుంది.

పసితనంలో సాంప్రదాయిక పద్ధతిలో 'శివస్తోత్రమాల' వంటి రచనలూ సంస్కృతం నుంచి అనువాదాలూ కొన్ని చేసినా, కుమారన్ ప్రఖ్యాతి కాల్పనిక ధోరణిలో రాసిన ఖండ కావ్యాలనే ఆశ్రయించుకొని వుంది. అయితే సాంప్రదాయికతను పూర్తిగా విడనాడకుండా కాల్పనికత తోటి సమసింప జేశాడని అనవచ్చు. తాత్వికంగా వేదాంత ధోరణి కుమారన్ మనస్సును గట్టిగా పట్టింది. అనిత్యమైన ఈ లోకమంతా మాయ అనీ, జీవిత సాఫల్యం ఇహలోకాతీతమైనదనీ భావించే వాడు. ఆయన ప్రణయ కావ్యాల తత్వ భూమిక ఇదే.

"స్నేహ (ప్రేమ) గాయకన్" అని పేరు పొందిన కుమారన్ భావానుభూతికి ప్రాముఖ్యమిస్తూ రాసిన ఖండ కావ్యాలలో మొదటిది 'వీనపువు' (రాలిపడిన పూవు). అన్యాపదేశంగా మానవ జీవిత వైభవాన్నీ అనివార్యమైన దురంతాన్నీ పుష్ప సంకేతం ద్వారా అద్భుతంగా వర్ణించే యీ కావ్యం రాజరాజ వర్మ ప్రశంసను అందుకొంది. పూవు పూసింది మొదలు వాడి రాలిపోయే దాకా శోభాయమానమైన దాని యవ్వనాన్నీ సౌందర్యాన్నీ ఆనందాన్నీ దశ తర్వాత దశగా వర్ణిస్తాడు. దాని ఐహిక జీవితం అనిత్యం. రాలిపడిన ఈ పువ్వే ముందు ముందు కల్ప వృక్షాన మళ్లీ మొగ్గ తొడుగుతుందేమో! లేదా ఒక అప్సరస కేశాలంకారం కావచ్చు. దివ్యర్షుల పూజాపుష్పం కావచ్చు. అంటే, ఐహికంగా అది పొందలేని నిత్య శోభను మరణానంతరం పొందవచ్చు. ఇలాంటి భావ ధోరణిలో కాల్పనికత ఎంత వుందో, వేదాంత తత్వం అంత వుంది.

చిననాటి చెలిమి తర్వాత విడిపోయిన దివాకరన్, నళిని చాలాకాలానికి మళ్లీ తారసిల్లినప్పుడు తమ ప్రథమ ప్రణయం కంటె భిన్నమైన నిస్వార్థ ప్రణయ భావానికి ఆత్మార్పణ చేసుకొని భౌతికమైన ఆనందం పొందగోరుతారు. నళినిలో ఈ భావ పరివర్తనం కలగడానికి దివాకరన్ ఉపదేశం తోడ్పడుతుంది. దివాకరన్, నళిని

మానవ వ్యక్తులుగా కనిపించినా ప్రాచీన కవి సమయాన్ని అనుసరించి సూర్యుడూ, పద్మం అనే సంకేతాలుగా కూడా భావించవచ్చు.

పార్శీ ప్రణయ కావ్యమైన 'లైలా మజ్నూ' ప్రేరణతో కుమారన్ రచించిన 'లీల' లో కూడా యీ అశరీర ప్రణయానందమే సంభావ్యమయింది. తన యిష్టానికి వ్యతిరేకంగా తండ్రి నిర్ణయించిన అర్థపాలకుడనే సంపన్న వర్తకుడి భార్య అయిన లీల తండ్రీ భర్తా గతించాక తన బాల్య సఖుడైన మదనన్‌ను అన్వేషిస్తూ పోయి చివరకు వింధ్యాటవుల్లో కలుసుకొంటుంది. అప్పటికే అతడు ప్రణయోన్మాది అయివున్నాడు. ఈ హఠాత్ ఘటనకు నిలవలేక నదిలో పడిచనిపోతాడు. లీల అనుసరిస్తుంది. క్షణ కాలమే శారీరక ప్రణయపారవశ్యాన్ని అనుభవించిన యువతీ యువకులు మరుక్షణం దుర్మరణం పొందారు. అయితే వెనువెంటనే దివ్య దంపతులుగా మారిపోతారనే సూచనతోటి ఈ కావ్యం ముగుస్తుంది.

ఉత్తర రామాయణ కథలో హృదయ విదారకమనిపించే ఒక ఘట్టాన్ని తీసుకుని 'చింతా విష్టయాయ సీత' అనే పేరుతో మరొక ఖండ కావ్యం రచించాడు. రాముడు స్వర్ణ సీతతో అశ్వమేధ యాగం నిర్వహిస్తున్నప్పుడు రామాయణ కావ్యాన్ని గానం చేసేందుకు లవకుశులు వాల్మీకి వెంట అయోధ్యకు వెళ్లాక, ఆశ్రమంలో ఒంటరిగా కూర్చుని సీత పరిపరి విధాల చింతిస్తుంది. ఈ కావ్యం ఆసాంతం సీత స్వగతమే. విమర్శకులు కొందరు ఆశాన్ కావ్యాలలో ఇదే ఉత్తమమైందని భావించారు.

మలబారు ప్రాంతంలో మోప్లా తిరుగుబాటు తదనంతర కల్లోల పరిస్థితులను పూర్వరంగం చేసుకుని కుమారన్ రాసిన 'దురవస్థ' ఎన్నో విమర్శకులకు అగ్గమైంది. నిస్సహాయస్థితిలో సావిత్రి అనే నంబూద్రి బ్రాహ్మణ యువతి చాతన్ అనే పులయా అస్పృశ్యుని శరణు జొచ్చి, క్రమంగా యీ పరిచయాన్ని స్నేహంగా, స్నేహాన్ని ప్రేమగా మార్చుకొని అతని భార్య అయినట్లు వర్ణించిన ఈ కావ్యం, పై కులాలకు చెందిన విమర్శకులకు ఎంతో పనిబెట్టింది. అయితే, నారాయణగురు ప్రభావంలో కుమారన్ పొందిన సంస్కరణ భావోత్తేజమే యీ రచనకు కారణం గాని బ్రాహ్మణ నింద కారణం కాదు. బౌద్ధ యితివృత్తాలలో చండాలిక కథను తీసుకొని, ఆనందుడి దప్పిక దీర్చిన ఒక చండాల కన్యను గౌతమ బుద్ధుడు ఎలా భిక్షుణిగా సమాదరిస్తాడో ఒక కావ్యంలో, మధురానగరంలో వేశ్య వాసవదత్త రాజాజ్ఞ వల్ల కాలు చేతులు పోగొట్టుకొన్న తర్వాత ఉపాలి ఎలా ఓదారుస్తాడో మరొక కావ్యంలో కుమారన్ వర్ణించి చెప్పాడు.

మలయాళీ కవిత్వాన్ని ఆధునికం చెయ్యగలిగిన కవిత్రయంలో కుమారన్ ఆశాన్ ప్రథముడు.

# కందుకూరి వీరేశలింగం



**యు**గ పురుషు లనిపించుకొనే మహానుభావులు కొందరుంటారు. కాలం వారి కాలివెంట నడుస్తుంది. వారి ప్రయత్నాలు మహోద్యమాలవుతాయి. వారు తొక్కిన అడవిపుంత ఘంటాపథంగా మారుతుంది. చరిత్ర వారి చేతిలో మైనంలా తన రూపుదిద్దుకొంటుంది. యుగధర్మానికి తాము మూర్తిమత్వాన్ని కల్పించగలుగుతారు. అలాంటి ధన్యజీని కందుకూరి వీరేశలింగం పంతులు (1848–1919). తెలుగుజాతి జీవిత తలాన్నంతటినీ బలంగా స్పృశించి వదిలాడు. ఆయన కృషిని తలచుకొంటే, అనేక శిఖరాలు గలిగిన మహాపర్వతం కంటిముందు నిలుస్తుంది.

భాషా సాహిత్యాలనే గాకుండా సామాజిక జీవితాన్ని అంతటినీ కుదిపివేయగలిగిన వీరేశలింగం లాంటి వ్యక్తులు ఎక్కడైనా ఎప్పుడైనా అరుదుగానే కనిపిస్తారు.

మరెందరో వివిధంగా చెయ్యగలిగిన కార్యాన్ని తాము ఒక్కరూ చేసి చూపగలరు. వీరేశలింగం పుట్టిననాటి పరిస్థితిని చనిపోయిననాటి పరిస్థితితో పోల్చినప్పుడే ఆయన తెచ్చిన మార్పును సమ్యంగా అంచనా వేయగలం. ఆచారాలు, విశ్వాసాలు, పద్ధతులు, విలువలు వీటన్నిటిలోనూ ఆధునికమని చెప్పదగిన నిర్దిష్టమైన ధోరణులు ఆయన చేతులమీదుగానే తెలుగువారి జీవితంలోకి ప్రవేశించాయి. శైలిలాంటి చిన్న విషయాలే గాకుండా, ప్రయోజనం వంటి పెద్దవి కూడా సాహిత్యంలో నిశ్చితంగా రూపాంతరం చెందాయి. ప్రక్రియలు సరికొత్తవి ప్రాచుర్యంలోకి వచ్చాయి. ఇది విప్లవ సన్నివేశం.

కోరంగిలోనో ధవళేశ్వరంలోనో చిన్నచిన్న పాఠశాలల్లో బడిపంతులుగా పనిజేస్తూ వచ్చిన వ్యక్తి ఇంతటి గొప్ప మార్పుని తీసుకురాగలిగాడంటే నమ్మడం కూడా కష్టం. ఇది ఒక్కరోజులో దూకిపడింది మాత్రంకాదు. అలాగే, తానెంతటి వజ్రసంకల్పుడయినా ఒంటరిగా మాత్రమే చరిత్రను మధ్యయుగాల నుంచి బయటవెయ్యలేదు. కొత్తరకం వారి కామనలన్నీ తనలో సంగమించాయి. అంతేకాదు. ఆ తరం కొత్త సామాజిక వర్గానికి సంబంధించింది. ఇంగ్లీషు చదువుల వల్ల అది పైకి వస్తున్నట్లు కనిపించినా సామాజిక సంబంధాల వెనుకదలికలోనే దాని ప్రాబల్యం అనివార్యంగా వుంది. ఆంధ్రదేశంలో దాని పరిణామాన్ని వీరేశలింగం జీవితంలో ప్రస్ఫుటంగా చూడవచ్చు. భూస్వామ్యానికి అనుగుణమై వుండిన పండిత సంప్రదాయాన్ని వీరేశలింగం ప్రయత్నపూర్వకంగా తోసివేస్తూ, కొత్త సామాజిక జీవిత దశకు అనుకూలించే సాహిత్యమార్గాన్ని బలీయం చేశాడు. శైలిలోనూ ఇతివృత్తంలోనూ వీరేశలింగం కలిగించిన మార్పు సమాజాభ్యుదయానికి లోబడింది.

సాంప్రదాయికత ఆవరణలోనే పుట్టి పెరిగిన వీరేశలింగం మొదట్లో సాంప్రదాయికంగానే రచనలు చేశాడు. ఒకటి రెండు శతకాలు రాశాడు. చిన్నయసూరి తలదన్నేట్లుగా 'విగ్రహం', 'సంధి' అనువదించాడు. ఓష్ఠ్యాలు రాకుండా వచనం లేకుండా శుద్ధాంధ్రంలో నైషధం రచించాడు. ఉన్నట్లుండి తెంచినట్టుగా ఈ ధోరణి ఆగిపోవడానికి కారణం సమాజ సంస్కరణోద్యమ అవసరాలు సాహిత్యం పట్ల కలిగించిన సరికొత్త చూపే. సులభ గ్రాంథిక శైలిలో నవలలు, ప్రహసనాలు, జీవిత చరిత్రలు, వ్యంగ్య రచనలూ, శాస్త్రపుస్తకాలూ, పత్రికా వ్యాసాలూ, ఇలా అనేక రూపాలుగా ఆధునిక దృక్పథానికి ప్రవేశమూ ప్రాచుర్యమూ కలిగించాడు. ఇంగ్లీషు నాటకాలను అనుసరిస్తూ సంస్కృత నాటకాలను అనువదిస్తూ పోయాడు. సాహిత్య కళామూల్యాలను బట్టి ఇవన్నీ ఉత్తమశ్రేణికి చెందకపోవచ్చు. వీటిలో ఉపదేశాత్మకత అతిశయించి వుండవచ్చు. అయినా అవన్నీ ఒక ఉన్నతమైన ప్రయోజనాన్ని సాధించేందుకు వెలువడ్డాయి కాబట్టి వాటికి ప్రాముఖ్యం ఉంది.

తెలుగు సాహిత్యంలో ఎన్నో కొత్త ప్రక్రియలకు తానే ఆద్యుడననీ వీరేశలింగం తన 'స్వీయచరిత్ర'లో రాసుకొన్నాడు. ఇది ప్రత్యక్షర సత్యంకాదని పరిశోధనలు నిరూపించాయి. అయితే నవలగాని, నాటకంగాని, మరొకటిగాని వీరేశలింగం స్పర్శవల్లనే ప్రసిద్ధమూ రూఢమూ అయింది. అంతక్రితమే వచ్చిన వాటితో పోల్చిచూస్తే, ఈ ప్రక్రియల కన్నిటికీ సాహిత్య గౌరవమూ ప్రతిష్ఠా కలిగింది, వీరేశలింగం రచనల

వల్లనేనని తెలుస్తుంది. అందుకని వీటికి పితామహుడు అయనేననిపించుకోగలిగాడు. తనకు స్వకీయమయిన జీవితతత్వం ఒకటి వుంది. తక్కినవారికి అది లేదు. ఇందువల్లనే వారి రచనలకు రాని ప్రశస్తి వీరేశలింగం రచనలకు వచ్చింది. బ్రహ్మసమాజ భావాలతోబాటుగా, సంఘసంస్కరణ భావాలు వచ్చి ఆ తత్వానికి ఆచరణలో విశిష్టతను కలిగించాయి. రాజారామమోహన్‌రాయ్ మొదలు శివనాథశాస్త్రి వరకూ ఒకవైపున, ఈశ్వర్‌చంద్ర విద్యాసాగర్ మొదలు కార్వే, రామాబాయి సరస్వతి వరకూ మరొకవైపున, ఒకేఒక్క వీరేశలింగంగా పర్యవసించినారు. ఏకేశ్వరారాధన మతవిషయాలలో వీరేశలింగం లక్ష్యం. ఎందరో కానీ ఆచరించని యజ్ఞోపవీత పరిత్యాగాన్ని ఆలస్యంగానైనా చేసి కార్యశూరుడనిపించుకొన్నాడు. వితంతు పునర్వివాహ కృషిని యుద్ధప్రాతిపదిక మీద నిర్వహించాడు. ఉన్నత కులాలకు చెందినవారి అధమ పద్ధతులను బట్టబయలు చేశాడు. భోగంమేళాలను కంటగించుకొన్నాడు. అధికారవర్గం అవినీతిని ఎదుర్కొన్నాడు. స్త్రీ విద్యకు నడుంకట్టాడు. 'పంచముల' విద్యావిజ్ఞానాల కోసం కృషి చేశాడు. మూఢవిశ్వాసాలకు పోటీగా శాస్త్రవిజ్ఞానాన్ని నిలబెట్టాడు. బహుముఖమైన ఈ అసాధారణ కృషి సారమే వీరేశలింగం జీవితతత్వం.

'వివేకవర్ధని', 'హాస్య సంజీవని', 'సత్య సంవర్ధని' వంటి పత్రికలను తన మహోద్యమానికి వేదికలుగా మార్చుకొన్నాడు. అంతకుముందునుంచీ తెలుగులో పత్రికలు వుంటూ వచ్చాయిగాని అవేవీ ఇంత ఏకోన్ముఖంగా ప్రజాభిప్రాయాన్ని మలచుకోలేదు.

గోల్డ్‌స్మిత్ నవల 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్' ను అనుసరించి వీరేశలింగం రాసిన 'రాజశేఖర చరిత్రము' మళ్లీ ఇంగ్లీషులోకి అనువాదం అయిందంటే అది అనుకరణ మాత్రంకాదని తెలుస్తుంది. మధ్యతరగతికి చెందిన ఒక తెలుగు బ్రాహ్మణ గృహస్థు జీవితం ఒడిదుడుకులను వర్ణించే నెపాన గత శతాబ్ది ద్వితీయార్థం నాటి తెలుగువారి జీవిత చిత్రణ ఇందులో లభిస్తుంది. అంటే, గొప్ప నవల అనడం కంటె మంచి సామాజిక దృశ్యం అనడం సబబు. 'సత్యవతీ చరిత్ర'లో విద్యావివేకాలు గల ఆదర్శగృహిణి భావాలను ప్రకటించాడు.

పాఠకులను బలంగా ఆకర్షించిన వీరేశలింగం ప్రహసనాల్లో చెప్పుకోదగినవి 'బ్రాహ్మ వివాహము' మొదటిది. గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' నాటకానికి మాతృక గాకపోయినా దీని ప్రభావం మాత్రం ఆయనమీద వుంది. ప్లీడర్ నాటకం అని పేరుబడిన 'వ్యవహార ధర్మబోధిని' కూడా ప్రదర్శనలో రక్తిగట్టింది. 'తిర్యగ్ విద్వన్మహాసభ' మరొక పటుతరమైన ప్రహసనం. ఇంగ్లీషు మూలాల నుంచి తెలుగుజేసిన ప్రహసనాలు అనేకం వున్నాయి. వీరేశలింగం హాస్యం వజ్రాయుధం లాంటిది. హేళనతోబాటు ఖండన దాని లక్షణాలు. ఈ రచనల్లో వ్యావహారిక శైలిని ప్రయోగించినందుచేత భాషా విషయకంగా గూడా వాటికి ప్రాముఖ్యం వుంది. నాటకానువాదాలలో శాకుంతలం మంచి రచన అనిపించుకొంది. షేక్స్పియర్ షెరిడన్ నాటకాలను అనుసరిస్తూ 'చమత్కార రత్నావళి', 'రాగమంజరి', 'కళ్యాణ కల్పవల్లి' స్విఫ్ట్ 'గల్లివర్స్ ట్రావెల్స్' పద్ధతిలో 'సత్యారాజా పూర్వదేశయాత్రలు' రచించాడు. వీరేశలింగం రాసిన 'ఆంధ్రకవుల చరిత్రము' అప్పటికి లభించిన చారిత్రక సమాచారం పరిమితుల

దృష్ట్యా నిర్దుష్టమైన రచన. 'స్వీయచరిత్రము' మౌలికమైనది. జీవిత చరిత్రలను ఎన్నిటినో రాసి పాఠకులకు విషయపరిజ్ఞాన పరిధిని విస్తరింపజేసినట్టే, శాస్త్రగ్రంధాల రచన ద్వారా వాళ్ళకు ఆధునిక దృక్పథం కలిగించాడు. ఇన్ని విధాలుగా వచన సాహిత్యాన్ని అభివృద్ధికి తెచ్చాడు గనకనే 'గద్యతిక్కన' అనిపించుకోగలిగాడు.

సాహిత్య కళాకారుడుగా వీరేశలింగం స్థాయి ఏదైనా, సాహిత్యానికి ఉత్తమ ప్రయోజనాన్ని వువలక్షించి, అనేక నూతన ప్రక్రియలను వ్యాప్తికి తెచ్చిన వీరేశలింగం ఆధునిక తెలుగు సాహిత్యానికి మూలపురుషుడు.



# గురజాడ అప్పారావు



ఆంధ్ర భాషా సాహిత్యాలు కందుకూరి వీరేశలింగం హస్తస్పర్శతో మధ్యయుగాల ముద్రను సడలించుకొన్నాయిగాని ఆధునికయుగ లక్షణాలు వాటికింకా పూర్తిగా పట్టుబడలేదు. సంస్కరణపరాయణమైన వీరేశలింగం మనస్సు సాహిత్య ప్రమాణాల మీదికి పోవలసినంత పోలేదు. ఏ ఒక్క ప్రక్రియకు గూడా కళాపరిపుష్టి కలగలేదు. వీరేశలింగం వేగుచుక్క మాత్రమే. సాహిత్యమహోదయం మరో తరం కృషి ఫలితం. ఈ తరానికి గురజాడ వేంకట అప్పారావు (1862–1915) ఆద్యుడు.

నవ్య భావాలను బలంగా పట్టించుకొన్న గురజాడ తెలుగు భాషనూ, సాహిత్యాన్నీ పెద్దమలుపు తిప్పాడు. పండిత సంప్రదాయం నుంచి సంకల్పపూర్వకంగా తప్పించి వాటి రెంటికీ అపూర్వమైన సౌలభ్యాన్నీ సౌందర్యాన్నీ సమకూర్చే కృషిలో

గెలుపొందాడు. సామాజిక జీవితంలో ప్రజాస్వామ్యం వైపుగా మొదలైన వెనుకదలిక సాహిత్యంలో ప్రతిబింబించడానికి గురజాడ బుద్ధిబలం కారణమైంది. ఇలా తాను శకకర్త అనిపించుకోగలిగాడు.

విజయనగరం మహారాజా కాలేజీలో ఇంగ్లీషు భాషా సాహిత్యాలను, గ్రీక్, రోమన్ చరిత్రలను బోధిస్తూ వచ్చాడు. ఆ తర్వాత ఆనందగజపతి అనుగ్రహంతోటి సంస్థానం వ్యవహారాల్లో ప్రవేశించి చివరకు రీవారాణి అంతరంగిక కార్యదర్శిగానూ, శాసనపరిశోధకుడుగానూ పనిచేశాడు. ప్రభుత్వ అధికారులతోనూ, ఉద్యోగులతోనూ పరిచయం ద్వారా పలుకుబడి పెరిగింది. ఆనాటికి అందరిలాగే తానూ బ్రిటిష్ రాజ్యాధికారం పట్ల గురినీ, నమ్మకాన్నీ ప్రదర్శించాడు. అయితే చరమదశలో భారతజాతీయోద్యమ పరిణామాలను గమనిస్తూ మితవాదులను విమర్శించేదాకా వెళ్ళాడు. ఇంగ్లీషు చదువుల గురించి కూడా అప్పారావుకు గొప్ప అభిప్రాయం ఉండేది. అవి ఆధునిక శాస్త్ర విజ్ఞానానికి ద్వారాలుగా మౌఢ్యాన్నీ బుద్ధిమాంద్యాన్నీ దెబ్బతీయగలవు గనకనే వాటిని ప్రస్తుతించడం జరిగింది. తాను స్వయంగా సంఘసంస్కర్త గాకపోయినా, సంస్కరణోద్యమానికి దోహదం కలిగించే సాహిత్యాన్ని సృష్టించాడు. గిడుగు రామమూర్తి ప్రారంభించి నడపసాగిన వ్యావహారిక భాషా ఉద్యమానికి తన రచనలతో స్ఫూర్తి కలిగించాడు.

చిన్నతనంలో సంస్కృతం చదువుకొన్నా సంస్కృత భాషా పాండిత్యం గురజాడ అప్పారావుకు గుదిబండగా మారలేదు. తెలుగు సాహిత్యంలో సైతం పాండిత్యాన్ని శిరోభారం చేసుకోలేదు. ఇంగ్లీషు సాహిత్యంలో విశేషమైన పరిచయం సాహిత్య సృజనపరంగా ఎంతో లాభించింది. వర్డ్స్‌వర్త్‌నూ, బర్న్స్‌నూ, షేక్స్‌పియర్‌నూ ఒంట బట్టించుకొన్నాడు. వీరి ప్రభావం వృత్తినే పోలేదు. సాంప్రదాయిక ఛందస్సులను వదిలేసి మాత్రా ఛందస్సులను చేపట్టాడు. 'ముత్యాలసరం' భామినీషట్పదికి అనుకూలమైన ఛందస్సు. గురజాడ కవితలు ఎక్కువగా ఈ ఛందస్సును స్వీకరించాయి. 'తేటైన మాటలతో' చిన్న చిన్న కథా కావ్యాలు రాశాడు. గుండెలు పిండే విషాదాన్ని 'పూర్ణమ్మకథ' ప్రకటిస్తే 'కన్యక' నిప్పులుముస్తుంది. మైత్రి మహాత్యాన్ని 'డామన్ – పిథియన్' ప్రదర్శిస్తే 'లవణరాజుకథ' శుభ్రమైన సమాజతత్వాన్ని చాటుతుంది. సంభాషణాత్మకమైన 'తోకచుక్క' ఆధునిక శాస్త్ర విజ్ఞాన దృక్పథానికి దర్పణం కొద్దిలో లౌకికత్వాన్ని చూపెట్టే కవిత 'మనిషి'. పట్టుమని పదికూడా లేని యీ చిరుత రచనలే అప్పారావును 'గురజాడ వాల్మీకి' గా నిరూపించాయి.

కథానిక ప్రక్రియను దాదాపు ప్రారంభించింది గురజాడే. వీటిలో వివిధమైన సామాజిక జీవిత ఖండాల చిత్రణ యిమిడిపోయింది. సంఖ్యలో ఇవికూడా స్వల్పమే వాసిలో మాత్రం గొప్పవి. ప్రతికథలోనూ పాత్రలు పరమవాస్తవికంగా రూపొందాయి. స్త్రీపాత్రలు మరీ విశిష్టమైనవి. 'దేవుడు చేసిన మనుషుల్లారా మీ పేరేమిటి' లో నాంచారమ్మ, 'సంస్కర్త హృదయం'లో సరళ, మరోకథలో మెట్టిల్డా, ఇంకో కథలో కమలిని – దేనికదే.

గురజాడ అప్పారావు అనగానే గుర్తుకు వచ్చే రచన 'కన్యాశుల్కం' నాటకం. అతి

బాల్య వివాహం వల్ల కలిగే దారుణమైన అనర్థాలను దృష్టిలో ఉంచుకొని వీరేశలింగం నిర్వహించిన ఉద్యమం వెలుగులో గత శతాబ్దం ముగియకముందే రాసిన యీ నాటకాన్ని ఈ శతాబ్దం ప్రారంభంలో మార్చి, పెద్దది చేసి, రెండవసారి రాశాడు. ప్రదర్శనీయత విషయం ఏమైనా, ఇది చాలా గొప్ప రచన. ఇది పెద్ద ప్రహసనమే గాని నాటకం కాదనే వాళ్ళు ఇందులో హాస్యాన్ని మాత్రమే చూశారు. నిజానికి ఈ హాస్యం వెనుక దుర్భరమైన విషాదం దాగుంది. దారుణమైన సామాజిక భీభత్సం కనిపిస్తుంది. మానవ ప్రమేయాలకు శుభ్రతరమైన రూపాన్ని కల్పించడానికే ఈ అసమానమైన నాటకం వుద్దిష్టమయింది. మంచితనాన్ని పెంచడమే అప్పారావు మహదాశయం.



# వల్లత్తోల్ నారాయణ మీనన్



ఏకకాలంలో ఒక్కరికి మించి మహాకవులనబడేవారు ఉండడం ఏ సాహిత్యానికైనా అపురూపమే. అలాంటిది యీ శతాబ్దం ప్రథమార్థంలో మలయాళీ సాహిత్యానికి తటస్థించిన విశేషం. ప్రాచీన సంస్కృతకావ్యాల ప్రభావం వీరందరి మీదనూ తరతమ భేదాలతో వుంది. కాల్పనిక వైఖరులను ప్రయత్నపూర్వకంగా ఎంత అవలంబించినా, సంస్కృతకావ్య ప్రభావం నుంచి వీరెవ్వరూ బయటపడి రాలేదు. నిజానికి, వారి రచనలలో సంప్రదాయంతోటి నవ్యత సమసించింది. అయినా వీరిని నవ్య సంప్రదాయికులని అనలేము.

ఇంగ్లీషు చదువు ముక్కూ మొగమూ తెలియకుండానే ఇంగ్లీషు కాల్పనిక సాహిత్య ధోరణులను పోలినవాటిని మలయాళీ సాహిత్యంలో సృష్టించిన కవి వల్లత్తోల్

నారాయణ మీనన్ (1878–1957). నిమ్న కులోద్ధరణ వుద్యమంలో కుమారన్ ఆశాన్ లాగా తలమునకలు గాకుండా దళిత వర్గాభ్యుదయాన్ని కోరుకున్నాడు. గాంధీని 'గురునాథన్' గా ఎంచి జాతీయోద్యమాన్ని బలపరుస్తూ, ప్రపంచశాంతి వుద్యమంలో గూడా ప్రముఖంగా పాల్గొని పోలండు రాజధాని వార్సా దాకా వెళ్ళి వచ్చాడు. ఒకవైపున పుంఖానుపుంఖంగా కవితలు రాస్తూ మరొకవైపున కథకళీ నృత్య రూప పునరుజ్జీవనానికి విశేషంగా కృషి చేశాడు. ఆశాన్ లాగా వల్లతోల్ గొప్ప వ్యక్తి.

పసితనంలో సంస్కృత భాషలో చేసిన రచనలూ అనువాదాలూ అటుంచి, మలయాళీ భాషలో స్వీయచరిత్రాత్మకంగా రాసిన 'బధిర విలాపం' తోటి వల్లతోల్ సాహిత్యసృజన కొత్త తెన్ను పట్టింది. 'బంధ స్థానాయ అనిరుద్ధన్', అనే ఖండ కావ్యం ప్రశస్తమైన రచన. ఉష అభ్యంతర మందిరం నుంచి అనిరుద్ధుణ్ణి బంధాగారానికి మార్చినప్పుడు మంత్రిని ఒప్పించి ప్రియుణ్ణి సందర్శించి ఎంతో గుండె నిబ్బరం చూపెట్టిన ఉష పాత్రలో స్వేచ్ఛను గాఢంగా అభిలషించి ధైర్యంగా ప్రవర్తించే ఆధునిక మహిళ కనిపిస్తుంది. మరొక పౌరాణిక ఇతివృత్తాన్ని తీసుకొని రుక్మిణి అన్న రుక్మి పశ్చాత్తాపాన్ని వర్ణించడం జరిగింది. అయితే ఈ ఘటనలు మాత్రం కల్పితాలే. 'కిలిక్కోంచల్' లో సీతను ఐదేళ్ళ పసిపిల్లగా మిథిలా నగరవనాలలో ఆడుతున్నట్టు మనోహరంగా చిత్రించాడు.

మరింత ముఖ్యమైన జీవిత విషయాల గురించి రాసిన ఖండ కావ్యాలు కొన్ని వున్నాయి. ఇవి వర్ణనా ప్రధానాలు కావు, విషయ ప్రధానాలు. వీటిలోనూ పౌరాణిక ఇతివృత్తాలే అధికం. కన్న కొడుకు వినాయకుడికీ అస్త్ర విద్య నేర్పిన పరశురాముడికీ మధ్య కైలాసంలో పోట్లాట జరిగినప్పుడు శివుడి డోలాందోళనను చిత్రించేది 'శిష్యమ్ముమకణుమ్'. భర్త దుష్యంతుడి నిరాదరణకు పాత్రమై కశ్యపరుష్యాశ్రమంలో తన కుమారునితో సహా జీవించే శకుంతలను చూసి ఆమె వృత్తాంతం విని దుష్యంతుడి మీద కోపం తెచ్చుకున్న విశ్వామిత్రుడి ప్రవర్తననూ శకుంతల మెత్తటి ఎత్తిపొడుపునూ 'అచ్చానుమ్ మకుళమ్' ప్రదర్శిస్తుంది.

వల్లతోల్ ఖండ కావ్యాలలో పేరెన్నికగన్నది. 'మాగ్దలాన మేరియమ్'. ధనవంతుడైన సైమన్ ఇంటికి శిష్యులతో కలిసి వచ్చి భోజనం చేస్తున్న జీసస్ క్రీస్తు వద్దకు పశ్చాత్తప్త హృదయంతో వచ్చి ఆయన పాదాలను తన కన్నీటితో కడిగి పూర్వజీవితానికి స్వస్తి చెప్పే మేరీ మాగ్దలీన్ కథను ఈ ఖండకావ్యంలో కమనీయంగా చెప్పాడు. ఇది వెలువడిన తరువాత అదే ఇతివృత్తంతో పది పన్నెండు మలయాళీ కావ్యాలు వచ్చాయంటేనే చాలు, వల్లతోల్ రచన ఎంత గొప్పదో తెలుసుకోవచ్చు.

తన చిన్న రచనలను కలిపి 'సాహిత్య మంజరి' పేరున వెలువరించడం వల్లతోల్‌కు పరిపాటి అయింది. అలాంటివి తొమ్మిది వచ్చాయి. దేశాభిమాన పూరితమైనవీ కథాగర్భితాలైనవీ చారిత్రాత్మకమైనవీ ఎన్నెన్నో కవితలు వీటిలో వున్నాయి. కేరళ ప్రాంతమంటే సహజంగానే ఎంతో మమకారం, భారత దేశమంటే అభిమానం, జాతీయోద్యమం పట్ల అంకురిత అభినివేశం, ఇలాంటి లఘు కావ్యాలలో ప్రస్ఫుటంగా

కనిపిస్తాయి. స్థల, జల దృశ్యాల అద్భుతవర్ణన వల్లతోల్‌ను ప్రకృతి కవిగా నిరూపిస్తుంది. సంస్కృత కావ్యాల శ్లోకఛందస్సును వదిలి మలయాళీ దేశీ ఛ్ఛందస్సులను అవలంబించడం కూడా వీటిలో గమనించవచ్చు. ఇలాంటి అనేక లక్షణాలు ఒక సరికొత్త ధోరణిని ప్రవేశపెట్టాయి. ముందుతరం కవులు దీన్ని అనుసరించారంటే చాలు, వల్లతోల్ ఒక నూతన సంప్రదాయ ప్రవర్తకుడయ్యాడని తెలుసుకోవచ్చు.

వల్లతోల్ కావ్యాలలో కొన్ని జీవితంలోకి విషాదాన్ని అనేక ముఖాలుగా ప్రదర్శించినప్పటికీ, ప్రధానంగా మాత్రం జీవితాన్ని సౌఖ్యమయంగా ఉదాత్తంగా చిత్రించడమే ఉంటుంది. తనకు పుట్టెడు చెవుడు వచ్చిందని విలపించిన సందర్భంలో గూడా ఆయన నిరాశకు లొంగిపోలేదు. 'పరీక్షలో విజయం', 'ఉరికంబం మీద కూడ' అనే కవితలలో కనిపించేది ఈ ఆశావాదమే. వాల్మీకి, వ్యాసుడు, జనకుడు, పరశురాముడు, ఇలాంటి పురాణపురుషుల గురించి రాసేప్పుడు వల్లమాలిన అభిమానాన్ని ప్రదర్శిస్తాడు.

సుబ్రమణ్య భారతిలాగా వల్లతోల్ జాతీయ స్థాయిని పొందాడు. స్వాతంత్ర్య పోరాటంలోని వివిధ దశలకు ఆయన కవితలు అద్దం పట్టాయి. త్రివర్ణ పతాకం గురించీ, చర్ఖా గురించీ, ఖద్దరు గురించీ, అస్పృశ్యతా నివారణ గురించీ ఆయన రాసిన పాటలకు బహుళ ప్రచారం లభించింది. అస్పృశ్యతను కేవలం వర్ణ విషయకంగానే గాక వర్గ విషయకంగా కూడా ఆయన దర్శించగలిగాడు. ఆర్థిక విషయాలను అవగతం చేసుకున్నాడు. అభ్యుదయవాది అనిపించుకున్నాడు.



# బి.ఎం. శ్రీకంఠయ్య



ఆధునికత కన్నడ సాహిత్యాన్ని మిగిలిన దేశ భాషా సాహిత్యాల కంటె కాస్త ఆలస్యంగా స్పృశించింది. కన్నడ భాషా ప్రాంతాలన్నీ ఒకే పరిపాలన కింద లేకపోవడం ఒకానొక కారణం కావచ్చు. అయినా బ్రిటీష్ రాజకీయ ప్రభావానికి కన్నడ దేశం పూర్తిగా వెలిబడిందని అనుకోవడం పొరబాటు. నిజానికి పరోక్షంగానైనా అది బలంగా తాకింది గనకనే కన్నడ భాషా ప్రాంతాలలో అధికభాగం గత శతాబ్దిలోనే ఆధునికతా ప్రాంగణానికి వచ్చి నిలువగలిగాయి. ఇంగ్లీషు వాడి పుణ్యమా అని శబ్దకోశాలు వచ్చాయి. ప్రాచీన శాసనాలు సంపుటాల కెక్కాయి. ముద్రణాలయాలు తలెత్తాయి. వచనం కుబుసం విడిచింది. అనువాదాల ఉరవడి ఎక్కువైంది. ఇవన్నీ నవోదయ ఉద్యమానికి రంగాన్ని సిద్ధం చేశాయి. ఈ శతాబ్దం ద్వితీయ దశాబ్ది ప్రారంభానికి గాని అది మొదలు కాలేదు.

ఇంగ్లీషు కవిత్వంలో కాల్పనిక యుగంగా పేరుపొందిన దశలోని కవుల ప్రబలాకర్షణ తోటి బి.ఎం. శ్రీకంఠయ్య (1884–1946) 'ఇంగ్లీషు గీతగళు' అనే సంకలనంలో వర్డ్స్‌వర్త్ షెల్లీ, బ్రౌనింగ్ వంటి కవుల రచనలలో కొన్నిటిని కన్నడీకరించారు. దీనితో కన్నడ సాహిత్యానికి నవయుగోదయమయిందని అనాలి. కథనాత్మక ధోరణికి స్వస్తిచెప్పి గీతి కావ్యాలను చేపట్టడం దీని ప్రముఖ లక్షణం. భాషలో, రీతిలో, ఛందస్సులో నవ్యత కనిపించే విధంగా ఉద్దేశపూర్వకంగానే అనువాదకుడు ప్రయత్నించడం వల్ల ఈ సంకలనం అపూర్వమయిన సాహిత్య ప్రభావాన్ని కలిగించగలిగింది. శ్రీకంఠయ్య గారి 'తళిరు' బృందంతోటి దీనిశక్తి ఉడిగిపోలేదు. నిజానికి అనువాదాల నుంచి స్వతంత్ర కావ్య నిర్మాణం అచిర కాలంలోనే విరివిగా సాగింది. బేంద్రే వంటి కవులూ వారి సహచరులూ కావ్యాలనూ, కథలనూ కొత్త పద్ధతిలో వెలయించసాగారు. నవలలు పుట్టుకొచ్చాయి. నాటకం ననదొడిగింది. ఆధునికత ప్రవాహప్రాయమయింది. దీనికంతటికి నాందీ వాచకం లాంటిది శ్రీకంఠయ్య చేసిన చిరు ప్రయత్నం.

మైసూరు సంస్థాన కళాశాలల్లో ఇంగ్లీషు ప్రొఫెసరుగా పనిచేసిన శ్రీకంఠయ్యకు ఇంగ్లీషు సాహిత్యమంటే వల్లమాలిన అభిమానం ఉండటం ఆశ్చర్యకరమేమీ కాదు. అలాగని ఆయన కన్నడ భాషను చిన్నచూపు చూడలేదు. ఆయన అభిమానం కన్నడ భాషా సాహిత్యాలకే పరిమితం కాలేదు. మదరాసు రాష్ట్రంలో కొంత, బొంబాయి రాష్ట్రంలో మరికొంత, నైజాము సంస్థానంలో ఇంకొంత, మైసూరు మహారాజా పరిపాలనలో కొంత, ఇలా ఒకదానితో మరొక దానికి సంబంధం లేకుండా ఉండిన కన్నడ భాషా ప్రాంతాలను అన్నిటినీ సమైక్య రాష్ట్రంగా పరిణమింపజేయాలని కలగని కృషి చేసిన వారిలో శ్రీకంఠయ్య పేరు ముందుగా చెప్పడం న్యాయం. కాకుంటే ఈవిధంగా రూపొందే సమైక్య రాష్ట్రాన్ని మైసూరు మహారాజా పాలన క్రింద ఉంచాలనుకోవడమే ఆ కలకు వచ్చిన వెలితి. అలాగే జాతీయవాదాన్నీ స్వాతంత్ర్య పోరాటాన్నీ ప్రతికూలించకపోయినా, బ్రిటీష్ పరిపాలన పట్ల తగని మెప్పు శ్రీకంఠయ్యకు ఉండేది.

'ఇంగ్లీషు గీతగళు' లో శ్రీకంఠయ్య చేర్చిన ఖండికలు మూల రచయితల కృతులలో గొప్పవేమీ కాదు. అనువాదకుడుగా తన శక్తికి సరిపడగల వాటినే ఎంపిక చేయడం జరిగిందని తానే ఒప్పుకున్నాడు. వాటి మేలుకీతలు ముఖ్యమైనది కాదు. అవన్నీ చూపిన పుంతే ముఖ్యం. శ్రీకంఠయ్య గొప్పకవి అనడంకంటె గొప్ప మార్గదర్శి అనడమే సబబు. 'ఇంగ్లీషు గీతగళు'లో శ్రీకంఠయ్య సొంత కవితలు ఉన్నాయి. ఆ తర్వాత ఇరవై మూడేళ్ళకు 1943 లో 'హొంగనసగళు' (పసిడి కలలు) అలా కాదు. అవన్నీ ఆయన రచనలే. తనదని చెప్పదగిన జీవన దర్శనం ఆసాంతం ఈ ఖండికలో ప్రత్యక్షమవుతుంది. భారత దేశాభిమానానికి జతగా కన్నడ భూమి పట్ల మమకారం కనిపిస్తుంది. ఛందస్సు, శబ్దం, వైఖరి, అంతా స్వోపజ్ఞకం. ఇంగ్లీషు కవిత్వ రూపాలలో ఒకటైన 'ఓడ్'ను 'ప్రగాథ' పేరుతోటి కన్నడ కవిత్వానికి తెచ్చి నిలిపాడు.

హంపీ విజయనగర సామ్రాజ్యం ఆరో శతాబ్ది ఉత్సవం సందర్భంగా కన్నడ దేశ పూర్వ ఘనత ప్రస్తుత దుస్థితి గురించీ నిర్భరమైన, భావోద్రేకాలతో 'కన్నడ

తాయనోట' అనే బృహత్కవితను రచించడం జరిగింది. మైసూరు విశ్వవిద్యాలయ రజతోత్సవ సందర్భంగా రాసిన 'శుక్రగీతె' ఈ సంపుటానికి వన్నె తెచ్చే రచన.

రణ్ణకవి ఎన్నడో రచించిన 'సాహస భీమ విజయ' కావ్యం నుంచి కొన్ని భాగాలను నేర్పుతో కూర్చి 'గదాయుద్ధ నాటకం' పేరుతో శ్రీకంఠయ్య ఒక రచన చేశాడు. ప్రాచీన గ్రీక్ నాటకాలను అనుకరించే ఆలోచనతో ఆయన రాసిన స్వతంత్ర నాటకం 'అశ్వత్థామ'. మూలకథను మార్చి అశ్వత్థామను చిరంజీవిగా కాకుండా ఆత్మహంతగా చిత్రించాడు.

'శ్రీ' అనే మారు పేరుతో ప్రసిద్ధికెక్కిన శ్రీకంఠయ్య స్వయంగా మహాకవి కాకపోవచ్చు. తన తరువాత గొప్ప రచయితలుగా ప్రసిద్ధికి వచ్చిన ఎందరెందరికో ఒక కొత్త బాట వెయ్యడమే శ్రీకంఠయ్య గొప్పదనం. బేంద్రె, కువెంపు, మాస్తి, అడ్యు రంగాచార్య లాంటి వారికందరికీ సాహిత్య ప్రేరణ కలిగించింది, ఎన్నడో 1920 లో 'శ్రీ' చేసిన చిన్న ప్రయత్నమే.



# సుబ్రహ్మణ్య భారతి



సంప్రదాయ బద్ధంగా ఉండిపోయిన తమిళ సాహిత్యలోకంలోకి గత శతాబ్ది మధ్యనాటికే కొత్త గాలి దూరివచ్చింది. సృజనాత్మక రెక్కలు పూన్చుకొంది. భావన వెల్లబారింది. రామలింగస్వామి పాటలు, గోపాలకృష్ణ భారతి కవిత్వం, సుందరంపిళ్లై నాటకం, కళ్యాణ సుందరం ముదలియార్ పద్యాలు, వీటన్నింటిలోనూ తొంగిచూసిన నవ్యత అక్కడితో ఆగలేదు. కవి, నవలాకారుడు అయిన వేదనాయకంపిళ్లై, నవలాకారుడు రాజంఅయ్యర్, పండితుడు యు.వి. స్వామినాథ అయ్యర్ తమిళభాషకూ, సాహిత్యానికీ గల సాంప్రదాయికతాబంధనాలను పూర్తిగానే విచ్ఛేదించలేదు. ఈ కార్యం సాధించిన వ్యక్తి సుబ్రహ్మణ్య భారతి (1882–1921).

తండ్రి చిన్నస్వామి అయ్యరు ఎట్టయాపురం జమీందారు ఆశ్రితుడుగా ఉండేవాడు. తాను తండ్రితో కలిసి ఆ కొలువుకు పోతూ పసితనంలోనే పదకవితలతో అక్కడి

వారిని ఆశ్చర్యచకితులను చేసేవాడు. 'భారతి' అనే బిరుదనామం ఎట్టయాపురం సుబ్బయ్యకు ఇలాగే సమకూరింది. తండ్రి అకాలమరణం కుటుంబానికి పేదరికం మిగిలించింది. చిన్ననాడే కన్నతల్లిని పోగొట్టుకున్న భారతి మార్గాంతరంలేక కాశీలో ఉన్న బంధువుల వద్దకు వెళ్లి రెండు సంవత్సరాలుండి అలహాబాద్ విశ్వవిద్యాలయంలో ఎంట్రెన్స్ పరీక్ష ఇచ్చాడు. హిందీ, సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో ప్రవేశమూ సంపాదించుకొన్నాడు. కాశీలో అతని ప్రతిభ మొగ్గదొడిగింది. తిరిగి వచ్చి బీదబడి పంతులుగా కొన్నాళ్ళు పనిచేశాక మళ్ళీ జమీందారీ కొలువులో చేరాడు కాని త్వరలోనే బయటపడి మదురైలో తమిళపండితుడుగా కొద్ది కాలమే పనిచేశాడు. మదరాసులో జి. సుబ్రహ్మణ్యం తమిళపత్రిక 'దేశాభిమాని'లో చేరినప్పటినుంచి భారతి జీవితం పెద్ద మలుపు తిరిగింది.

ఇళాంగో, వల్లువార్ వంటి ప్రాచీన తమిళ మహాకవుల రచనలనేగాక, ఇంగ్లీషు, కాల్పనిక కవి షెల్లీ రచనలను కూడా ఆసక్తితో చదివి ఆకళించుకొంటూ వచ్చిన భారతి ఇప్పుడు పాత్రికేయుడుగా జాతీయోద్యమ నాయకుల ఉపన్యాసాలను అనుసరించవలసి రావడమేగాకుండా, సొంతంగా వ్యాసాలను రాసే వీలుకూడా కలిగింది. కాంగ్రెస్‌లో అతివాదులను అభిమానిస్తూ కాంగ్రెసు మహాసభలకు వెళ్లి వస్తూ ఉండేవాడు. అలాంటి ఒక సందర్భంలో సిస్టర్ నివేదితను కలిసి ప్రసంగించి ప్రేరణ పొందాడు. ఆవిడను తన ఆధ్యాత్మిక గురువుగా సంభావించాడు. మితవాద రాజకీయాన్ని బలపరిచే సుబ్రహ్మణ్యఅయ్యరు పత్రికను వదిలి 'ఇండియా' అనే సొంత పత్రిక నడిపాడు. ఆ కాలంలో ప్రకటించిందే దేశభక్తి పూరితమైన 'స్వదేశ గీతంగళ్' అతివాదనాయకుల మీద ప్రభుత్వం నిర్బంధం మొదలయ్యాక తన మీదికి గూడా విస్తరించింది. అరెస్టు కాకుండా పాండిచేరికి వెళ్లి అక్కడినుంచి 'ఇండియా'నూ మరికొన్ని చిన్న చిన్న పత్రికలనూ నడిపాడు. బ్రిటిష్ పాలిత ప్రాంతాలకు రాకుండా వీటిని ప్రభుత్వం అటకాయించింది. భారతి చిక్కుల్లో బడ్డాడు. అరవిందఘోష్, వి.వి.యస్. అయ్యర్ వంటి విప్లవకారుల సహవాసం, సాంగత్యం లభించినా పూటగడవని పరిస్థితి ఏర్పడింది. ఈ కష్టకాలంలోనే భారతి భావాలు పరివర్తనం చెందాయి. క్రమంగా వేదాంతతత్వాన్ని అలవరచుకొన్నాడు. ఇది శక్తితత్వ రూపం ధరించింది. ఇప్పుడు కవిత్వం కేవలం భావావేశమేగాక ఆత్మను ఉద్దీపింపచేసే యోగసాధన అనిపించింది. మాయతెరను తొలగించి జ్ఞానతేజస్సును చూపే సాధనం అనిపించింది. ఈ దశలో రాసినవే 'కణ్ణన్ పాట్టు', 'పాంచాలీ శపథం', 'కుయిల్ పాట్టు' వంటి గొప్పరచనలు. పాండిచేరిలో ఉండడం ఇష్టంలేక తెగించి బ్రిటిష్ పాలిత ప్రాంతానికి వచ్చినప్పుడు అరెస్టు చేశారు గాని బెసెంటమ్మలాంటి గొప్ప వ్యక్తుల విజ్ఞాపన మేరకు త్వరలోనే విడుదల చేశారు. మళ్లీ 'స్వదేశమిత్రన్'లో చేరవలసి వచ్చింది. అప్పటికి భారతిలోనూ మార్పు వచ్చింది. తీవ్రవాదం జోరు తగ్గింది. గాంధీ శకోదయంలో అహింసా మార్గాన్ని సమర్థించసాగాడు. ఇంతలో ఒకనాడు మదరాసులోని ట్రిప్లికేన్ దేవాలయం ఏనుగు తొండం దెబ్బనుంచి తేరుకోలేక భారతి అకాలంగా మరణించాడు.

జాతీయోద్యమ కాలంలో విశాలమైన దేశభక్తి భావాన్ని ప్రకటించే ఉజ్వలగేయాలు భారతి లేఖిని నుంచి వెలువడ్డాయి. దైవభక్తిని చాటే రచనల్లో కూడా దేశభక్తి భావం చోటుచేసుకొనేది. తమిళ భాషా సాహిత్యాలను అభిమానించినట్టే అన్యభాషా సంస్కృతి సాహిత్యాలనూ ప్రస్తుతించాడు. భారతదేశ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను ఆకాంక్షించినట్టే అన్యదేశాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అభినందించాడు. బెల్జియం స్వతంత్ర దేశంగా అవతరించినప్పుడూ విప్లవం జరిగి సోవియట్ రష్యా అవతరించినప్పుడూ భారతి బలంగా స్పందించాడు. కుల, మత భేదాలను నిరసించాడు. దారిద్ర్యాన్ని గర్హించాడు. స్వేచ్ఛతోబాటు సమానతను ఆపేక్షించాడు. భారతి కవిత వివిధంగా ఉన్నా దానికంతటికీ ఆధ్యాత్మికత మూలకందం. మహాశక్తి రూపాలను అనేకంగా దర్శించి తన కవితలతో కీర్తించాడు. మహాశక్తిని జగజ్జననిగా భావించాడు. కణ్ణన్ పాట్టులో కృష్ణుణ్ణి వివిధ భావాల భక్తితో సమారాధించాడు. పరాభవం చెంది కన్నీర్ర జేసిన పాంచాలి-ద్రౌపది లోకి ఆదిశక్తి ప్రవేశాన్ని చిత్రించాడు. 'కూయిల్ పాట్టు' గేయాలు భారతి ప్రేమతత్వాన్ని నిరూపిస్తాయి.

సంఘ సంస్కరణ భావాలు భారతి వచనరచనలలో విరివిగా కనిపిస్తాయి. తక్కువ కులాలుగా యెంచబడే వాటి గురించి, అస్పృశ్యత గురించి, స్త్రీ దుర్దశ గురించి భారతి చాలా బాధచెందాడు. బాల్యవివాహాల వల్ల కలిగే అనర్థాలను మనస్సులో ఉంచుకొని వితంతు పునర్వివాహాన్ని సమర్థిస్తూ రాయబూనిన 'చంద్రికై కతై' అసంపూర్ణ నవల.

తమిళ భాషా సాహిత్యాలకు పునర్నవం కలిగించిన సుబ్రహ్మణ్య భారతి పూర్వచ్ఛందస్సుల నుంచి పూర్తిగా బయటపడకపోయినా కావ్యభాషకూ వ్యవహార భాషకూ మధ్య సేతువు నిర్మించాడు. అలంకార భారం వదిలించి సాహిత్య భాషకు సరళత్వాన్నీ పటుత్వాన్నీ కలిగించాడు. దేవతల గురించీ దైవభక్తి గురించీ రాసినా, భారతిది నవీన దృక్పథమేగాని సాంప్రదాయకమైనదికాదు. జనం నోళ్లలో జీవం పోసుకుంటూ వస్తున్న బాణీలను ఎన్నిటినో తెచ్చి శిష్టసాహిత్యానికి అన్వయించాడు. కావ్య రచనలకు సరికొత్త యతిప్రాసాలను సమకూర్చాడు. రవీంద్రనాథ్ టాగూర్ తర్వాత భారతిలాగా సువిశాలమైన ఖ్యాతిపొందిన కవి మరొకరు లేరేమో! భారతి జాతీయకవి స్థాయిని అందుకొన్నాడు.

